శ్రీః

శ్రీ శంకరభగవత్పాదవిరచితః

భజ గోవిందమ్ నామ

# మోహముద్గరః

రామోరావిరచిత **'మృణాలినీవ్యాఖ్యా'** సహితః




కారణికః

**రావి మోహనరావు,** M.Sc., M.A.,

**510, ప్రైడ్ బ్లాక్, ప్లాటినమ్ కౌంటీ, గోరంట్ల, గుంటూరు-522034**

శ్రీః
శ్రీశంకరభగవత్పాదవిరచితః
'భజగోవిందమ్' నామ

# మోహముద్గరః

రామోరావిరచిత 'మృణాళినీవ్యాఖ్యా' సహితః

*ప్రథమముద్రణ : దీపావళి, **2022***
**50th Wedding Anniversary Edition of**
**Ramora & R.Krishna Kumari**
*ప్రతులు : **200***
*పేజీలు : **108***
*వెల రూ. : అమూల్యము*


**Ravi Mohana Rao**
**510, Pride Block, Platinum County**
**Opp. Hosanna Mandir, Gorantla,**
**GUNTUR - 522034, Andhra Pradesh**
**Cell : 9440115411**

***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : **9573711454**

***Printed at -***
Mohan Publications
Rajahmundry.



## నమస్సులు

కోరిన తడవే ముందుమాటను అందించిన సన్మిహితులు డా॥ సూరం శ్రీనివాసులు గారికి నమస్సులు. ఈ మృణాళినీ వ్యాఖ్యానమునందు ఉదాహృతమయిన గ్రంథ రచయితలకు, వ్యాఖ్యాతలకు, అంతర్జాలనిధికి గౌరవ పురస్సరముగ నమస్సుమాంజలులు.

**– రామోరా.**



# మోహముద్గరం

**'నహి నహి రక్షతి డుకృఞ్ కరణే'** అంటూ ప్రారంభించి ఆదిశంకరులు ఒక వ్యాకరణ పండితుడికో, విద్యార్థికో చేసిన హితబోధ మోహముద్గరం. ఆ కాడికివస్తే ఒక్క వ్యాకరణం ఏమిటి? ఏదీ కూడా కాలదృష్టినుండి ప్రాణిని తప్పించలేవు. ఆదిశంకరులే మరొకచోట తర్కశాస్త్రాన్ని కూడా ఇలాగే నిరసిస్తారు.

**ఘటో వా మృత్పిండోఽప్యణురపి చ ధూమోఽగ్నిరచలః**
**పటో వా తంతుర్వా పరిహరతి కిం ఘోరశమనమ్ ।**
**వృథా కంఠక్షోభం వహసి తరసా తర్కవచసా**
**పదామ్భోజం శమ్భోర్భజ పరమసౌఖ్యం వ్రజ సుధీః ॥**

ఇది శివానందలహరిలోని శ్లోకం. ఘటం, మృత్తు, ధూమం, అగ్ని, పర్వతం, పటం (వస్త్రం), తంతువు (దారం) ఇవన్నీ తార్కికులు శాస్త్రవిషయాలను నిరూపిస్తూ ప్రముఖంగా వాడే పదాలు. ఈ తర్కవాక్కులు కంఠక్షోభ మాత్రమే కానీ మృత్యువునుండి తప్పించగలవి కావు. కాబట్టి శంభుపాదాంబుజాలనే సేవించు అని ప్రబోధం. పైన గోవిందుని భజించమన్నాడు. ఇక్కడ శంభువును. మృత్యుముఖంనుండీ తప్పించగలవారు శివకేశవులే కానీ తర్కవ్యాకరణశాస్త్రాలు కాదని ప్రబోధ సారాంశం.

వాస్తవమే. తర్కానికో, వ్యాకరణానికో అంత శక్తి లేదు. కనీసం వేదాంతానికైనా ఉందా? వేదానికైనా ఉందా? కాలకంఠపాశంనుండి తప్పించగల శక్తి లేదా తప్పించుకోగల శక్తి మరి దేనికైనా ఉందా? అలా తప్పించుకొని అవిచ్ఛిన్నంగా సాగుతున్నది కాలం మాత్రమే. ఎందుకంటే అది సర్వాధారం. మృత్యువుతో సహా అన్నింటికీ ఆధారమదే. దాని కౌగిలినుండి మృత్యువైనా తప్పించుకోలేదు.

పై శ్లోకాలలో వ్యాకరణవేత్తను 'మూఢమతే!' అన్నాడు. తార్కికుని 'సుధీః' అన్నాడు. విరుద్ధలక్షణతో తార్కికుని కూడా నిందిస్తున్నాడా? లేక తర్కాన్ని నిందిస్తూ తార్కికుని గౌరవిస్తున్నాడా? లేదా యాదృచ్ఛికంగా పదాలని ప్రయోగించటం జరిగిందా? ఆలోచించాలి.

వ్యవహారం సాగిపోవటానికి వ్యాకరణశాస్త్రం లేకపోయినా ఫరవాలేదు. అది మౌఖికాభ్యాసంతోనే అలవడుతుంది. కానీ వ్యవహారంలో కూడా అనుక్షణమూ అవసరమైనది తర్కం. మన ప్రతిపాదనలను ఇతరులు అంగీకరించాలంటే మనకు సహకరించేది తర్కమే.

**బ్రహ్మ సత్యం జగన్మిథ్యా**
**జీవో బ్రహ్మైవ నాపరః ॥**

అని శంకరాచార్యులు నిశ్చయించినా తార్కికశక్తివల్లనే గదా!

అసలు అనాదులైన జీవబ్రహ్మాదుల గుర్తింపు ప్రాచీన మానవుని తార్కికదృష్టితోనే ఆవిష్కృతమైంది. ఈ ప్రకృతి, తత్పరిణామ, తత్క్రమ, తద్విపర్యాసాలను గమనించిన తరువాత మానవునిలో కలిగిన లేదా పొడచూపిన ఊహలు, ఆలోచనలు, భయాలు, ఆందోళనలూ వీటి పర్యవసానరూపం అనంతచైతన్యం వైపు దర్శనం ప్రారంభమైంది. ఆ దర్శనఫలాలే నేడు మనం అనుభవిస్తున్న ఆధ్యాత్మిక భక్తిభావనల పరంపరలు. అంత లోతుగా ఆలోచించి ఆంతరజీవితాలను అద్భుతపరమాత్మవిలాసాలుగా ఆవిష్కరించుకున్న మనిషి, లౌకిక భౌతిక జీవితాన్ని తీర్చిదిద్దుకోవటంలో మాత్రం నాటికీ, నేటికీ కూడా విఫలమవుతూనే ఉన్నాడు.

తనకేమి కావాలో తనకు స్పష్టంగా తెలీదు. తనకేమి అవసరం లేదో కూడా తనకు స్పష్టంగా తెలీదు. తనదు అనుకొనే అవకాశమున్న ప్రతిదానిమీద తన పేరు వ్రాసికొని మురిసిపోవాలన్న తపన తప్పదా? వినియోగం, ఆ వినియోగఫలంలో తన వంతు, తన అవసరం కూడా స్పష్టంగా తెలియకపోయినా మెడచాచి చొరబడటమే ఘనవిజయంగా భావించే బలహీన దశకు చేరుకొని బ్రతుకుతున్నాడు. నాకెందుకు? నాకే ఎందుకు? అని ఏ స్థితిలోనయినా, ఏ పదార్థవిషయంలో అయినా ప్రశ్నించుకో గలిగితే ఏ మనిషి అయినా తానున్న స్థితి కన్నా ఉన్నత స్థితికి చేరుకోగలగటం చాలా తేలిక...

అటువంటి ఆలోచన చేయమని డుకృఞ్ కరణే పండితుడికి చేస్తున్న హితబోధ మోహముద్గరం. ఆధ్యాత్మికమనటం కన్నా లౌకిక జీవన మార్గదర్శిగా ఈ ప్రబోధాన్ని భావించి మనగలిగితే మనిషి లౌకిక జీవితమూ సుందరనందన మవుతుంది. లౌకికవిషయ

మోహాన్ని వదలమంటే మనం ఆధ్యాత్మిక విషయమోహాన్ని తగిలించుకుంటున్నామే గానీ దేని స్థానంలో దాన్నుంచ గలిగితే అదీ మోహం కాదు, ఇదీ మోహం కాదు. కాంతా విషయకరతి శృంగారమైతే భగవద్విషయకరతి భక్తి. ఆత్మవిషయకరక్తి ముక్తి అవుతుంది. అన్నింటా రతి సమానమే. అందుకనే ఆధ్యాత్మికవాదులు కూడా ముక్తికాంత, ముక్తికాంతా పరిష్వంగం వంటి పదబంధాలను అలవోకగా ప్రయోగించగలిగేది. **'ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః'** అని విధించిన తర్వాత రక్తి దోషమెలా అవుతుంది? అందుకే **'కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః'** అన్నది. కర్మలు చేయాలి. వంద ఏళ్ళు బ్రతకాలని కోరుకోవాలి. ఏ కర్మలు చేయాలి? ఏ కర్మనైనా ఏ దృష్టితో చేయాలి? తెలుసుకోగలిగితే బ్రతుకూ ముక్తియే, ముక్తీ, ఒక బ్రతుకే. ఈ విషయాన్ని కృష్ణరూపంలో వ్యాసుడు జాతికి ప్రబోధించినది. పనులు మానినంతమాత్రాన నైష్కర్మ్యం లేదనీ, అస్త్రసన్యాసం చేసి కర్తవ్య విస్మరణం చేయటం మేధావిత్వం కాదనీ నొక్కి వక్కాణించింది. మోహముద్గరంలోని ఆచార్యులవారి బోధ కూడా **'స్థితోస్మి గతసందేహః'** అంటూ కర్మవ్యోన్ముఖులు కావాలన్నదే లక్ష్యం. దానికనుగుణంగా ఆ మాటలను అర్థం చేసుకోవలసిన అవసరముందని గుర్తించి ఆ ప్రయత్నం చేయటం కర్తవ్యం. అంతేకానీ అంతా లేనిదనుకుంటూ అన్నీ మానేసి కూర్చోటం ఆధ్యాత్మిక జ్ఞానం కాదు. ప్రాణికి ఆకలి ఉన్నంతవరకు, అది తీరవలసిన అవసరమున్నంత వరకూ దానిని సరియైన మార్గంలో తీర్చుకోగలగటమే ఆధ్యాత్మిక జ్ఞానం.

అందుకే **"మూఢ! జహీహి ధనాగమతృష్ణాం, కురు సద్బుద్ధిం మనసి వితృష్ణామ్, యల్లభసే నిజకర్మోపాత్తం, విత్తం తేన వినోదయ చిత్తమ్"** అంటూ మోహముద్గరం ఆరంభమైంది. వితృష్ణను వదలాలి. నిజకర్మోపాత్తధనంతో వినోదించాలి. వినోదాన్నీ పరిహరించటం లేదు, కర్మనూ నిషేధించటం లేదు, ఆర్జననూ అవసరమనటంలేదు. ధనాగమతృష్ణను వితృష్ణను రెండింటినీ వదలమని మాత్రమే బోధ. అదే సక్రమమైన లౌకికధర్మాచరణం, అదే మరో మాటలో ఆధ్యాత్మిక జీవనశైలి. జగత్తు వ్యావహారిక సత్యమైనట్లు దేహేంద్రియాదులూ వ్యావహారిక సత్యాలే. జగత్తును పూర్తిగా నిరసించ గలిగిన రోజు దేహేంద్రియాదులనూ నిరసించవచ్చు, నిర్లక్ష్యం చేయవచ్చు. అంతేకానీ సాధారణ లౌకిక జీవన విషయంలో ఆధ్యాత్మికతను చొప్పించి తిరస్కరించటం యుక్తియుక్తమైన ఆధ్యాత్మికత కాదు. దానిని అభిలషించటం లేదు మోహముద్గరం.

**'లోకం సమస్తం శోకహతం విద్ధి'** అంటున్నదే కానీ శోక కారణాన్ని చెప్పటంలేదు. ఇతర శ్లోకాలలోని మాననీయమైన లోభ ప్రవృత్తియే దానికి కారణం కానీ లోకం కాదు. లోక స్థితియే అంత. అది స్వభావమే. దురతిక్రమమే. కానీ దానిని అతిక్రమించిన వారి చరిత్రలను మనం ఉటంకిస్తూ అది అసంభవమనటం, స్వభావమనటం కూడా పలాయనమే. అతిక్రమించి చూపగలిగితే ఆధ్యాత్మికత. అంటే లోకానికి దూరం కావటం కాదు. లోకంలో ఉంటూ లోకమర్యాదలను గౌరవిస్తూ, పాటిస్తూ తదతీతభావనలతో తన ప్రవృత్తినీ, ప్రవర్తననూ పరిష్కరించుకుంటూ ఆదర్శంగా నిలవగలగటం. జిజీవిషను కాదనరాదు. అదే **జీవన్ముక్తి.** అంతేకాని మరణానంతరం ఎక్కడికో వెళ్ళి తిరిగి రాకపోవటం ముక్తి కాదు. అదే ముక్తి అయితే ఈ జగత్తు ఏక్షణాన అయినా నిర్జీవమై సృష్టినారంభించిన పరమాత్మనే విరక్తికి గురిచేయవచ్చు. అది **ఆయన** అభిలాష కాదు (బహుస్యాం ప్రజాయేయ.) నిశ్చలతత్త్వమే జీవన్ముక్తి అన్నారు కానీ ఆచార్యులు తత్త్వరాహిత్యాన్ని ముక్తిగా పేర్కొనలేదు.

ఏతావాతా అర్జునుడికి కృష్ణుడు బోధించిన నిష్కామకర్మయోగాన్నే మోహముద్గరంలో శంకరాచార్యులు ప్రబోధిస్తున్నారు కానీ, పని మానివేసే కర్మసంన్యాసాన్ని కాదు, బ్రతుకు అంతరించిన తరువాత ఉందో లేదో ప్రమాణం లేని ముక్తినీ కాదు. జీవించియున్నపుడే ముక్తభావనతో జీవించటం, మరణం వరకు జీవించటం అనివార్యం కాబట్టి దానికి తగిన నివృత్తి లక్ష్యమైన ప్రవృత్తిమార్గాన్ని ఎంచుకొని జీవించటం మనిషి కర్తవ్యం. ఇంకేదో ఉందనే మోహం – ఆ మోహం ఆధిభౌతికమైనా కావచ్చు, ఆధిదైవికమైనా కావచ్చు, ఆధ్యాత్మికమైనా కావచ్చు – మీద కొట్టిన సమ్మెటదెబ్బ.

ప్రకృతం మోహముద్గర వ్యాఖ్యాత శ్రీ రామోరా (రావి మోహనరావు) గురించి ఇటువంటి సారస్వతానికి సంబంధించిన లోకంలో తెలియనివారు లేరు. ఒక అసాధారణమూ, ఆశ్చర్యజనకమూ అయిన కృషీ, సాధనా వారిది. మోహముద్గరం లోని భావాలతో పాటు, సంస్కృతభాషాధ్యయనానికీ అవకాశమిస్తూ సాగిన వ్యాఖ్య ఇది. ఇంతకు మునుపే ఈ పేరుతోనే మేఘదూతం వంటి కావ్యాలకు ఇంతటి విస్తృత వ్యాఖ్యలను వారు అందించి ఉన్నారు.

మోహముద్గరవ్యాఖ్యలో వారి జాగరూకత స్పష్టంగా కనిపిస్తుంది. "భార్యా బిభృతి

తస్మిన్ కాయే" అన్న పాదాన్ని (శ్లో-6) చాలామంది వ్యాఖ్యాతలూ, అనువాదకులు తప్పుగానే స్వీకరించి వ్యాఖ్యానించారు. బిభ్యతి బహువచన క్రియారూపం. దాన్ని ఏకవచనంగా భావించి భార్యాః అన్న బహువచనరూపాన్ని (సంధిలో విసర్గలోపం) ఏకవచనంగా స్వీకరించి 'భార్య అయినా భయపడుతుంది' అని అర్థం చెప్పారు. రామోరా గారు ఆ పొరపాటు చేయలేదు. సముచితంగా అన్వయించారు. వారి శ్రద్ధకిటువంటివే తార్కాణం.

ఈ వ్యాఖ్య కూడా పాఠకుల ఆదరణనూ, అభిమానాన్నీ పొందగలదని ఆశిస్తూ...

**- సూరం శ్రీనివాసులు**



శ్రీః
శ్రీశంకరభగవత్పాదవిరచితః
'భజగోవిందమ్'నామ

# మోహముద్గరః

శ్లో॥ భజ గోవిన్దం భజ గోవిన్దం
భజ గోవిన్దం మూఢమతే! ।
సంప్రాప్తే సన్నిహితే కాలే
న హి న హి రక్షతి 'డుకృఞ్కరణే' ॥ 1

శ్లో॥ మూఢ! జహీహి ధనాగమతృష్ణాం
కురు సద్బుద్ధిం మనసి వితృష్ణామ్।
యల్లభసే నిజకర్మోపాత్తం
విత్తం తేన వినోదయ చిత్తమ్॥ 2

శ్లో॥ నారీస్తనభరనాభీదేశం
దృష్ట్వా మా గా మోహావేశమ్ ।
ఏతన్మాంసవసాదివికారం
మనసి విచిన్తయ వారం వారమ్ ॥ 3

శ్లో॥ నలినీదలగతజలమతితరలం
తద్వజ్జీవితమతిశయచపలమ్ ।
విద్ధి వ్యాధ్యభిమానగ్రస్తం
లోకం శోకహతం చ సమస్తమ్ ॥ 4

శ్లో॥ యావద్విత్తోపార్జనసక్త -
స్తావన్నిజపరివారో రక్తః ।
పశ్చాజ్జీవతి జర్జరదేహే
వార్తాం కోఽపి న పృచ్ఛతి గేహే ॥ 5

శ్లో॥ యావత్పవనో నివసతి దేహే
తావత్పృచ్ఛతి కుశలం గేహే ।
గతవతి వాయౌ దేహాపాయే
భార్యాః బిభ్యతి తస్మిన్కాయే ॥ 6

శ్లో॥ బాలస్తావత్క్రీడాసక్త -
స్తరుణస్తావత్తరుణీసక్తః ।
వృద్ధస్తావచ్చిన్తాసక్తః
పరమే బ్రహ్మణి కోఽపి న సక్తః ॥ 7

శ్లో॥ కా తే కాన్తాః కస్తే పుత్రః?
సంసారోఽయమతీవ విచిత్రః ।
కస్య త్వమ్? కః కుత ఆయాత -
స్తత్త్వం చిన్తయ తదిహ భ్రాతః! ॥ 8

శ్లో॥ సత్సఙ్గత్వే నిస్సఙ్గత్వం
నిస్సఙ్గత్వే నిర్మోహత్వమ్ ।
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥ 9

శ్లో॥ వయసి గతే కః కామవికారః?
శుష్కే నీరే కః కాసారః? ।
క్షీణే విత్తే కః పరివారో
జ్ఞాతే తత్త్వే కః సంసారః? ॥ 10

శ్లో॥ మా కురు ధనజనయౌవనగర్వం
హరతి నిమేషాత్కాలస్సర్వమ్ ।
మాయామయమిదమఖిలం హిత్వా
బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా ॥ 11

శ్లో॥ దినయామిన్యౌ సాయం ప్రాతః
శిశిరవసన్తౌ పునరాయాతః ।
కాలః క్రీడతి గచ్ఛత్యాయు -
స్తదపి ముఞ్చత్యాశావాయుః ॥ **12**

శ్లో॥ కా తే కాన్తా ధనగతచిన్తా
వాతుల! కిం తవ నాస్తి నియన్తా ।
త్రిజగతి సజ్జనసంగతిరేకా
భవతి భవార్ణవతరణే నౌకా ॥ **13**

శ్లో॥ జటిలో ముణ్డీ లుఞ్ఛితకేశః
కాషాయామ్బరబహుకృతవేషః ।
పశ్యన్నపి చ న పశ్యతి మూఢో
హ్యుదరనిమిత్తం బహుకృతవేషః ॥ **14**

శ్లో॥ అఙ్గం గలితం ఫలితం ముణ్డం
దశనవిహీనం జాతం తుణ్డమ్ ।
వృద్ధో యాతి గృహీత్వా దణ్డం
తదపి న ముఞ్చత్యాశాపిణ్డమ్ ॥ **15**

శ్లో॥ అగ్రే వహ్నిః పృష్ఠే భానుః
రాత్రౌ చుబుకసమర్పితజానుః ।
కరతలభిక్షస్తరుతలవాస -
స్తదపి న ముఞ్చత్యాశాపాశః ॥ **16**

శ్లో॥ కురుతే గఙ్గాసాగరగమనం
వ్రతపరిపాలనమథవా దానమ్ ।
జ్ఞానవిహీనస్సర్వమతేన
భజతి న ముక్తిం జన్మశతేన ॥ **17**

శ్లో॥ సురమన్దిరతరుమూలనివాసః
శయ్యాభూతలమజినం వాసః ।
సర్వపరిగ్రహభోగత్యాగః
కస్య సుఖం న కరోతి విరాగః ॥ **18**

శ్లో॥ యోగరతో వా భోగరతో వా
సఙ్గరతో వా సఙ్గవిహీనః ।
యస్య బ్రహ్మణి రమతే చిత్తం
నన్దతి నన్దతి నన్దత్యేవ ॥ **19**

శ్లో॥ భగవద్గీతా కిఞ్చిదధీతా
గఙ్గాజలలవకణికా పీతా ।
సకృదపి యేన మురారిసమర్చా
క్రియతే తస్య యమేన న చర్చా ॥ **20**

శ్లో॥ పునరపి జననం పునరపి మరణం
పునరపి జననీజఠరే శయనమ్ ।
ఇహ సంసారే బహుదుస్తారే
కృపయాఽపారే పాహి మురారే! ॥ **21**

శ్లో॥ రథ్యాచర్పటవిరచితకన్థః
పుణ్యాపుణవివర్జితపన్థః ।
యోగీ యోగనియోజితచిత్తో
రమతే బాలోన్మత్తవదేవ ॥ **22**

శ్లో॥ కస్త్వమ్? కోఽహమ్? కుత ఆయాతః?
కా మే జననీ? కో మే తాతః ।
ఇతి పరిభావయ సర్వమసారం
విశ్వం త్యక్త్వా స్వప్నవిచారమ్ ॥ **23**

శ్లో॥ త్వయి మయి చాన్యత్రైకో విష్ణు -
ర్వ్యర్థం కుప్యసి సర్వసహిష్ణుః ।
సర్వస్మిన్నపి పశ్యాత్మానం
సర్వత్రోత్సృజ భేదాజ్ఞానమ్ ॥ 24

శ్లో॥ శత్రౌ మిత్రే పుత్రే బన్ధౌ
మా కురు యత్నం విగ్రహసన్ధౌ ।
భవ సమచిత్తః సర్వత్ర త్వం
వాఞ్ఛస్యచిరాద్యది విష్ణుత్వమ్ ॥ 25

శ్లో॥ కామం క్రోధం లోభం మోహం
త్యక్త్వాఽఽత్మానం పశ్యతి సోఽహమ్ ।
ఆత్మజ్ఞానవిహీనా మూఢా-
స్తే పశ్యన్తే నరకనిగూఢాః ॥ 26

శ్లో॥ గేయం గీతానామసహస్రం
ధ్యేయం శ్రీపతిరూపమజస్రమ్ ।
నేయం సజ్జనసఙ్గే చిత్తం
దేయం దీనజనాయ చ విత్తమ్ ॥ 27

శ్లో॥ సుఖతః క్రియతే రామాభోగః
పశ్చాద్ధన్త! శరీరే రోగః ।
యద్యపి లోకే మరణం శరణం
తదపి న ముఞ్చతి పాపాచరణమ్ ॥ 28

శ్లో॥ అర్థమనర్థం భావయ నిత్యం
నాస్తి తతస్సుఖలేశస్సత్యమ్ ।
పుత్రాదపి ధనభాజాం భీతిః
సర్వత్రైషా విహితా రీతిః ॥ 29

శ్లో॥ ప్రాణాయామం ప్రత్యాహారం
నిత్యానిత్యవివేకవిచారమ్ ।
జాప్యసమేతసమాధివిధానం
కుర్వవధానం మహదవధానమ్ ॥ **30**

శ్లో॥ గురుచరణామ్బుజనిర్భరభక్తః
సంసారాదచిరాద్భవ ముక్తః ।
సేన్ద్రియమానసనియమాదేవం
ద్రక్ష్యసి నిజహృదయస్థం దేవమ్ ॥ **31**



శ్రీః
శ్రీశంకరభగవత్పాదవిరచితః
'భజగోవిందమ్'నామ

# మోహముద్గరః

## మృణాలినీవ్యాఖ్యా - రామోరా

శ్లో॥ శివయోః సుధాహరిద్రాదీప్తిమతోః సారభృజ్జగత్పిత్రోః।
త్రిభువనవిఘ్నధ్వంసీ కరికల్పః కశ్చిదరుణిమా జయతి॥

తత్త్వసమ్మేళనాయ నమః

**1**

**అవతారిక :** ప్రాపంచిక విషయాలు - వ్యాకరణసూత్రాలు మనను రక్షించవు అనే సూచనతో బాటు గోవిందనామంతో నిర్గుణపరంబ్రహ్మను చేరవచ్చునని శ్రీశంకర భగవత్పాదులవారు ఈ శ్లోకమున చెప్పుచున్నారు.

**శ్లో॥ భజ గోవిన్దం భజ గోవిన్దం**
**భజ గోవిన్దం మూఢమతే! ।**
**సంప్రాప్తే సన్నిహితే కాలే**
**న హి న హి రక్షతి 'డుకృఞ్కరణే' ॥ 1**

**పదవిభాగము :** భజ, గోవిందమ్, భజ, గోవిందమ్, భజ, గోవిందమ్, మూఢమతే!, సంప్రాప్తే, సన్నిహితే, కాలే, న, హి, న, హి, రక్షతి, 'డుకృఞ్కరణే'।

**అన్వయక్రమము :** హే మూఢమతే! గోవిందం భజ। గోవిందం భజ। గోవిందం భజ। సన్నిహితే కాలే సంప్రాప్తే (సతి) 'డుకృఞ్కరణే' న హి రక్షతి। న హి (రక్షతి)।

**ప్రతిపదార్థము :**

హే మూఢమతే! = (ప్రాపంచిక విషయాలలో మునిగి తేలుతూ మమైకమైన) ఓ మూఢమతీ!

గోవిందమ్ భజ = గోవిందుని సేవింపుము
గోవిందమ్ భజ = గోవిందుని సంపాదించుకొనుము.
గోవిందమ్ భజ = గోవిందుని స్మరింపుము,
సన్నిహితే కాలే = అంత్యకాలము
సంప్రాప్తే = ఆసన్నమైనపుడు
'డుకృఞ్కరణే' = సంస్కృతధాతుపాఠసూత్రము
న హి న హి రక్షతి = ఏవిధంగానూ రక్షించదు (నాయనా!)
భజ గోవిందమ్.

**తాత్పర్యము :** ప్రాపంచికవిషయాలలో మునిగి తేలుతూ మమైకమైన ఓ మూఢమతీ! గోవిందుని సేవింపుము, గోవిందుని సంపాదించుకొనుము, గోవిందుని స్మరింపుము. అంత్యకాలము ఆసన్నమైనపుడు 'డుకృఞ్కరణే' సంస్కృతధాతుపాఠసూత్రము ఏవిధంగాను రక్షించదు (నాయనా!).

**పాఠాంతరము :** 1. భజ గోవిందమ్ – గోవిందం భజ

**సమాసాలు :** 1. మూఢమతే! – మూఢా మతిః యస్య సః మూఢమతిః। తస్య సంబుద్ధిః మూఢమతే! – బహువ్రీహిః ।

2. గోవిందమ్ – గాం విందతీతి గోవిందః। తమ్ గోవిందమ్ గోభిః వేద్యతే (ఉపనిషద్వాక్యైః జ్ఞాయతే) ఇతి గోవిందః। తమ్ గోవిందమ్.

**క్రియలు : 1. భజ** – 'భజ్' ధాతోః (భజ–సేవాయామ్) లోట్ పరస్మైపదే, మధ్యమపురుషః, ఏకవచనమ్, భ్వాదిః, ఉభయపదమ్ సకర్మకః.

| | | |
|---|---|---|
| భజతు / భజతాత్ | భజతామ్ | భజన్తు |
| **భజ** / భజతాత్ | భజతమ్ | భజత |
| భజాని | భజావ | భజామ |

1. (భజ్ – విశ్రాణనే, భాషార్థే, చురాదిః, ఉభయపదమ్, సకర్మకః)

**భజ** యతిరాజమ్ **భజ** యతిరాజమ్ ।
**భజ** యతిరాజమ్ భవ భీరో॥ (భజ యతిరాజస్తోత్రమ్)

**2. రక్షతి –** 'రక్ష' ధాతోః (రక్ష–పాలనే) లట్, పరస్మైపదే ప్రథమపురుషః, ఏకవచనమ్, భ్వాదిః, పరస్మైపదమ్, సకర్మకః।

| | | |
|---|---|---|
| **రక్షతి** | రక్షతః | రక్షన్తి |
| రక్షసి | రక్షథః | రక్షథ |
| రక్షామి | రక్షావః | రక్షామః |

శ్లో॥ ధర్మ ఏవ హతో హన్తి ధర్మో **రక్షతి** రక్షితః ।
తస్మాత్ ధర్మో న హంతవ్యో మా నో ధర్మో హతోఽవధీత్॥
– మనుస్మృతిః 8–15.

(ధర్మమును బాధిస్తే అది తిరిగి మననే బాధిస్తుంది, ధర్మమును రక్షిస్తే అది మనను రక్షిస్తుంది గాన ధర్మమును నాశము చేయకూడదు, ధర్మము నశించి మనలను నశింపజేయకుండును.)

**పదాదర్శము :** భజ గోవిందమ్

**1) భజ –** 'భజ్' ధాతోః భజ–సేవాయామ్ సేవించుట అని అర్థము – సేవింపుము, (సంపాదించుకొనుము / స్మరింపుము) నవవిధభక్తిమార్గములద్వారా భగవానుని సేవించుట–

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్॥

శ్రీమదాంధ్రమహాభాగవతమున శ్రీబమ్మెరపోతనామాత్యులవారు ఈ నవవిధ భక్తిమార్గములను మత్తేభవృత్తములో ఎంతో రమణీయముగా ఇలా వర్ణించారు.

మ॥ **తనుహృద్భాషలసఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా**
**ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం**
**బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మునున్ హరిన్ నమ్మి స**
**జ్జనుడై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా!**

1. భగవంతుని లీలలను వినడం – శ్రవణము
2. భగవంతుని లీలలను పొగడడం – కీర్తనము
3. నిరంతరం భగవన్నామాన్ని తలస్తూ ఉండటం – స్మరణము
4. భగవంతుని పాదములు ఒత్తుటవంటి సేవలు చేయడం – పాదసేవనము
5. భగవంతుని నిత్యం పూజించడం – అర్చించడము
6. భక్తితో నమస్కారం చేయడం – వందనము
7. భగవంతునికి దాసుడననే భావముతో సేవించడం – దాస్యము
8. భగవంతుడు నా చెలికాడు అనే భావముతో మెలగడం – సఖ్యము
9. భగవంతుడే నా సర్వస్వమని ఎఱుకతో ఉండటం – ఆత్మార్పణము

వివిధ భక్తిమార్గములలో తరించిన పుణ్యపురుషులు

1. శ్రవణము – పరీక్షిన్మహారాజు – భాగవతాన్ని విని తరించినాడు.
2. కీర్తనము – శుకబ్రహ్మ – భాగవతాన్ని చెప్పి తరించినవాడు.
3. స్మరణము – ప్రహ్లాదుడు – భగవన్నామాన్ని చెప్తూ తరించినవాడు.
4. పాదసేవనము – లక్ష్మీదేవి – పాదసేవనమే పరమావధిగా భావించినది.
5. అర్చనము – పృథుమహారాజు – భగవంతుణ్ణి నిత్యం పూజించి తరించినవాడు.
6. వందనము – అక్రూరుడు – శ్రీకృష్ణునికి నమస్కరించుటద్వారా తరించినవాడు.
7. దాస్యము – ఆంజనేయస్వామి – శ్రీరామచంద్రమూర్తిని సేవించుకొన్న తీరుద్వారా తరించినవాడు.
8. సఖ్యము – అర్జునుడు – లోకహితమైన బంధము ద్వారా మెలిగి తరించినవాడు.
9. ఆత్మనివేదనము – బలిచక్రవర్తి – తనని తాను సమర్పించుకొనుటద్వారా తరించినవాడు.

**2) గోవిందమ్ –**

అ) గాం విందతీతి గోవిందః। తం గోవిందమ్।

ఆ) గోభిః వేద్యతే ఇతి గోవిందః। తం గోవిందమ్।

ఇ) సర్వవేదాన్తసిద్ధాన్తగోచరం తమగోచరమ్।
గోవిందం పరమానందం సద్గురుం ప్రణతోఽస్మ్యహమ్॥
– వివేకచూడామణిః ।

శ్రీశంకరభగవత్పాదులవారు ఇట **గోవింద** నామముతో సగుణ ఈశ్వరుని, గురువుని, పరంబ్రహ్మను కూడా సూచించినారు.

విష్ణుసహస్రనామస్తోత్రములో రెండుచోట్ల **గోవింద** నామము వస్తుంది.

శ్లో॥ మహేష్వాసో మహీభర్తా శ్రీనివాసస్సతాంగతిః।
అనిరుద్ధస్సురానన్దో **గోవిన్దో** గోవిదాం పతిః॥ 20

189వ నామము – గోవిందః, ఓం గోవిందాయ నమః

శ్రీపరాశరభట్టర్ వారి భాష్యము – తద్గవామ్ – స్తుతిగిరామ్, విన్దః–(గోవిందః)

'గవాదిషు విన్దేస్సంజ్ఞాయామ్' ఇతి శః – త్రైస్సురైః స్తూయమానోపకారః. దేవతలయొక్క స్తుతిరూపములైన వాక్కులకు పాత్రమైనవాడు గనుక **గోవిన్దః** అనబడుచున్నాడు. 'గవాదిషు విన్దేః సంజ్ఞాయామ్' అను సూత్రముచేత 'గో'శబ్దపూర్వమైన 'విద' ధాతువునకు 'శ' అను ప్రత్యయము వచ్చి 'గోవిన్ద' శబ్దము సిద్ధించినది.

శ్లో॥ మహావరాహో **గోవిన్దః** సుషేణః కనకాఙ్గదీ।
గుహ్యో గభీరో గహనో గుప్తశ్చక్రగదాధరః॥ 58

543వ నామము గోవిందః, ఓం గోవిందాయ నమః.

శ్రీపరాశరభట్టర్ వారి భాష్యము – "నష్టాం చ ధరణీం పూర్వం అవిన్దశ్చ గుహాం గతామ్। గోవిన్ద ఇతి తేనాహమ్" ఇతి **గోవిన్దః**।

రాక్షసునిచే దొంగిలింపబడిన గోవును అనగా భూమిని తిరిగి సంపాదించి పొందినవాడు గనుక ఆ వరాహస్వామియే ఇచట **గోవింద** శబ్దముచే వ్యవహరింపబడు చున్నాడు. 'నష్టాం చ ధరణీం' ఇత్యాది మహాభారత శ్లోకమునుబట్టి ఈ విషయము తెలియుచున్నది. హిరణ్యాక్షునిచే పాతాలమున అదృశ్యముగా దాచబడిన భూమిని తిరిగి ఉద్ధరించినందున నన్ను మహర్షులు **గోవిందుడు** అందురు అని భగవంతుని చేతనే చెప్పబడినది.

(కృష్ణావతారమునందు గోవింద శబ్దము ఇంద్రునిచే స్వామివారికి ఉంచబడినది. ఇచట ఈ నామము వరాహస్వామివారికి మహర్షులచే ఉంచబడినది.)

**3. సంప్రాప్తే సన్నిహితే కాలే**

అ) శ్లో॥ **అంతకాలే** చ మామేవ స్మరన్ ముక్త్వా కలేవరమ్।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥

(మృత్యుసమయములో నన్నే స్మరిస్తూ శరీరాన్ని త్యజించి ఎవడు ప్రయాణిస్తున్నాడో అతడు నా స్వరూపాన్ని పొందును. ఇందు సందేహము లేదు) భ. 8–5

ఆ) శ్లో॥ కృష్ణ! త్వదీయ పదపంకజపంజరాన్త –
మద్యైవ మే విశతు మానసరాజహంసః।
**ప్రాణప్రయాణసమయే** కఫవాతపిత్తైః
కణ్ఠావరోధనావిధౌ స్మరణం కుతస్తే॥ ముకుందమాలా–7

ఓ కృష్ణా! నాయొక్క మనస్సనెడి రాయంచ నీయొక్క పాదపద్మములనెడి పంజరములో ఇప్పుడే ప్రవేశించుగాక. ప్రాణములు పోవు ఆఖరిగడియల్లో గొంతుక కొట్టుకులాడుతున్నప్పుడు నీయొక్క ధ్యానము ఎట్లు? (సంభవించును)

ఇ) శ్లో॥ వ్యత్యస్తపాదమవతంసితబర్హిబర్హం
సాచీకృతానన నివేశితవేణురంధ్రమ్।
తేజఃపరం పరమకారుణికం పురస్తాత్
**ప్రాణప్రయాణసమయే** మమ సన్నిధత్తామ్॥
– శ్రీకృష్ణకర్ణామృతమ్ 2–22

(శ్రీకృష్ణపరమాత్మా! నా ప్రాణప్రయాణసమయమున నాయెట్టయెదుట వచ్చి నిలుచుగాక!)

ఈ) శ్లో॥ **ప్రయాణకాలే** మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
స తం పరం పురుషముపైతి దివ్యమ్॥ – శ్రీమద్భగవద్గీత 8–10

యోగి మరణకాలమున నిశ్చలమనసుతోను, ఆత్మస్వరూపానుసంధాన రూపమగు భక్తితోను చిత్తస్థైర్యలక్షణమగు యోగబలముతో గూడినవాడై మొదట హృత్పుండరీకమునందు చిత్తమును వశపరచుకొని, పిదప హృదయస్థానమునుండి బయలుదేరిన సుషుమ్నా నాడిచే వాసనజయము, ఇంద్రియజయము, ప్రాణజయము, మనోజయములను క్రమముగా జేసికొనుచు కనుబొమల నడుమ ప్రాణము నుంచి జాగరూకుడై ఆత్మతత్త్వమును దెలిసికొనినచో నాతడు చైతన్యరూపుడగు పరమపురుషుని బొందును. – భాష్యార్కప్రకాశిక.

**4. న హి నహి రక్షతి డుకృఞ్కరణే।**

పరంబ్రహ్మమునందు దృష్టిని సారించుము. ప్రాపంచికవిషయములందు దృష్టిని సారించకుము. గోవిందుని సంపాదించుకొనుము. భజ గోవిందమ్.



## 2

**అవతారిక :** శ్రీ శంకరభగవత్పాదులవారు ఈ శ్లోకమున 'ధనమే పరమావధియని ప్రాకులాడకు, జీవితపరమార్థం గ్రహించు' అని మూఢమతులకొక హెచ్చరికను చేయుచున్నారు.

**శ్లో॥ మూఢ! జహీహి ధనాగమతృష్ణాం**
**కురు సద్బుద్ధిం మనసి వితృష్ణామ్।**
**యల్లభసే నిజకర్మోపాత్తం**
**విత్తం తేన వినోదయ చిత్తమ్॥ 2**

**పదవిభాగము :** మూఢ!, జహీహి, ధన+ఆగమతృష్ణామ్, కురు, సద్బుద్ధిమ్, మనసి, వితృష్ణామ్, యత్, లభసే, నిజకర్మోపాత్తమ్, విత్తమ్, తేన, వినోదయ, చిత్తమ్।

**అన్వయక్రమము :** (హే) మూఢ! ధనాగమతృష్ణాం జహీహి। వితృష్ణాం సద్బుద్ధిం మనసి కురు। నిజకర్మోపాత్తం యత్ విత్తం లభసే, తేన చిత్తం వినోదయ।

**ప్రతిపదార్థము :**

(హే) మూఢ! = ఓ మూఢుడా! అజ్ఞానముతో కప్పివేయబడినవాడా!
ధన+ఆగమ–తృష్ణామ్ = ధనము ఇంకా ఇంకా సంపాదించాలనే తపనను,
జహీహి = విడిచిపెట్టు.
వితృష్ణామ్ = కోరికలు వీడి,
మనసి = మనస్సునందు,
సద్బుద్ధిమ్ = ఈశ్వరబుద్ధిని,
కురు = చేయి (ఉంచు)
నిజకర్మ+ఉపాత్తమ్ = ధార్మికంగా సంపాదించిన నీదగు,
యత్ = ఏ,
విత్తమ్ = ధనమును,
లభసే = పొందెదవో
తేన = దానిచేత,
చిత్తమ్ = చిత్తాన్ని
వినోదయ = సంతోషింపజేయుము... భజగోవిందమ్.

**తాత్పర్యము :** ఓ మూఢుడా! ధనము ఇంకా ఇంకా సంపాదించాలనే ఆరాటాన్ని విడిచిపెట్టు. కోరికలు వీడి మనస్సునందు ఈశ్వరబుద్ధిని ఉంచు. ధార్మికంగా సంపాదించిన నీదగు ఏ ధనమును పొందెదవో దానిచేత చిత్తాన్ని సంతోషింపజేయుము.

**సమాసాలు :**

1. ధనాగమతృష్ణామ్ – ధనస్య ఆగమః ధనాగమః।
ధనాగమే తృష్ణా ధనాగమతృష్ణా। తామ్ ధనాగమ తృష్ణామ్।
2. సద్బుద్ధిమ్ – సతీ చాసౌ బుద్ధిః చ సద్బుద్ధిః । తామ్ సద్బుద్ధిమ్। కర్మధారయః।
3. వితృష్ణామ్ – విగతా తృష్ణా యస్యాః సా వితృష్ణా। తాం వితృష్ణామ్। బహుప్రీహిః।
4. నిజకర్మోపాత్తమ్ – నిజం తత్ కర్మ చ నిజకర్మ। తేన ఉపాత్తమ్। నిజకర్మోపాత్తమ్।

**క్రియలు :** 1. జహీహి – 'హా' ధాతోః (ఓహాక్ త్యాగే) కర్తరి లోట్ పరస్మైపదే, మధ్యమపురుషః, ఏకవచనమ్। జుహోత్యాదిః, పరస్మైపదమ్, సకర్మకః.

| | | |
|---|---|---|
| జహీతాత్ / జహాతు / జహితాత్ | జహితామ్ / జహీతామ్ | జహతు |
| జహిహి / జహాహి / **జహీహి** / | | |
| జహీతాత్ / జహితాత్ | జహీతమ్ / జహితమ్ | జహిత/జహీత |
| జహాని | జహావ | జహామ |

శ్లో॥ అస్థూలమిత్యేతదసన్నిరస్య
సిద్ధం స్వతో వ్యోమపదప్రతర్క్యమ్।
అతో మృషామాత్రమిదం ప్రతీతం
**జహీహి** యత్స్వాత్మతయా గృహీతమ్॥ – (వివేకచూడామణిః)

2. కురు – 'కృ' ధాతోః (డుకృఞ్కరణే) పరస్మైపదే లోట్ మధ్యమపురుషః, ఏకవచనమ్। తనాదిః, ఉభయపదమ్, సకర్మకః

| | | |
|---|---|---|
| కరోతు / కురుతాత్ | కురుతామ్ | కుర్వన్తు |
| **కురు** / కురుతాత్ | కురుతమ్ | కురుత |
| కరవాణి | కరవావ | కరవామ |

శ్లో॥ ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా **కురు**॥ భగవద్గీతా 18-63

(... 'యథా శాస్త్రం యథేచ్ఛమ్' శాస్త్రమునతిక్రమింపక నీయిచ్చవచ్చినటుల జేయు'మని తాత్పర్యము)

3. లభసే – 'లభ్' ధాతోః (డులభష్ ప్రాప్తౌ) లట్, ఆత్మనేపదే మధ్యమపురుషః ఏకవచనమ్। భ్వాదిః, ఆత్మనేపదమ్, సకర్మకః

| | | |
|---|---|---|
| లభతే | లభేతే | లభన్తే |
| **లభసే** | లభేథే | లభధ్వే |
| లభే | లభావహే | లభామహే |

శ్లో॥ అర్థాంతరేషు విముఖానధికారహానేః
శ్రద్ధాధనాన్ త్వదనుభూతివిళంబభీతాన్।
దీపప్రకాశ **లభసే** సుచిరాత్ కృతీవ
న్యస్తాత్మనస్తవ పదే నిభృతాన్ ప్రపన్నాన్॥ 28 శరణాగతిదీపికా

4. వినోదయ – వి ఉపసర్గపూర్వక 'నద్' ధాతోః (ణుద ప్రేరణే) **ణిజన్తాత్** కర్తరి లోట్ పరస్మైపదే మధ్యమపురుషః ఏకవచనమ్। తుదాదిః ఉభయపదమ్, సకర్మకః

| | | |
|---|---|---|
| వినోదయతు / వినోదయతాత్ | వినోదయతామ్ | వినోదయన్తు |
| **వినోదయ** / వినోదయతాత్ | వినోదయతమ్ | వినోదయత |
| వినోదయాని | వినోదయావ | వినోదయామ |

శ్లో॥ వ్యథయతి వృథా మౌనం తన్వి! ప్రపంచయ పంచమం
తరుణి! మధురాలాపైస్తాపం **వినోదయ** దృష్టిభిః ।
సుముఖి! విముఖీభావం తావద్విముంచ న ముంచ మాం
స్వయమతిశయస్నిగ్ధో ముగ్ధే! ప్రియోఽయముపస్థితః ॥ 5
– గీతగోవిందకావ్యే దశమసర్గే

(దృష్టిభిః తాపం వినోదయ – చూపులచేత సంతాపమును పోగొట్టుము)

**పదాదర్శము :**

**1. జహీహి ధనాగమతృష్ణామ్**

శ్లో॥ న్యాయోపార్జితవిత్తేన కర్తవ్యం హ్యాత్మరక్షణమ్।
అన్యాయేన తు యో జీవేత్ సర్వకర్మబహిష్కృతః॥
– పరాశరస్మృతి 12-43

(న్యాయముగా సంపాదించిన ధనముతోనే తనను పోషించుకోవలెను. అన్యాయముగా సంపాదించిన ధనముతో యెవడు జీవిస్తూ ఉంటాడో వాడు సర్వకర్మ బహిష్కృతుడు అవుతున్నాడు.)

శ్లో॥ న విత్తేన తర్పణీయో మనుష్యో
లప్స్యామహే విత్తమద్రాక్ష్మ చేత్త్వా।

జీవిష్యామో యావదీశిష్యసి త్వం
వరస్తు మే వరణీయః స ఏవ॥ కఠోపనిషత్తు 1-27

మనిషి ధనముచేత తృప్తిచెందేవాడు కాడు; నిన్ను చూస్తే సంపదను పొందుతాము. నువ్వు ఎంతవరకు పాలిస్తావో (అంతవరకు) జీవిస్తాము. నాచే కోరదగిన వరమో అదే. భజ గోవిందమ్.

శ్లో॥ శిష్టాన్నమీశార్చనమార్యసేవాం
తీర్థాటనం స్వాశ్రమధర్మనిష్ఠామ్ ।
యమానుసక్తిం నియమానువృత్తిం
చిత్తప్రసాదాయ వదంతి తద్‌జ్ఞాః ॥ - సర్వసిద్ధాన్త. 368

(పవిత్రమార్గములద్వారా ఆర్జించిన అన్నాదులతో జీవించుట, ఈశ్వరారాధన, సత్పురుషులను సేవించుట, తీర్థయాత్రలు గావించుట, స్వీయాశ్రమధర్మములయందు నిష్ఠ, అహింసాది నియమములను శ్రద్ధతో అనుసరించుట, మనోవృత్తులను శాసించుట యివన్నియు చిత్తనైర్మల్యమునకు అవసరమైనవి. (ఆపై ఉత్తమోత్తమగతులను జీవుడు పొందగలడు)

ఓం ఈశావాస్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్ ।
తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్యస్విద్ధనమ్ ॥
- ఈశావాస్యోపనిషత్తు-1

ఈ ప్రపంచమునందు అంతా పరమాత్మచే ఆవరింపబడినది. (అతడు లేనిది ఏదియు లేదు). దానిని (ఆ ప్రపంచోపాధిని) త్యజించి అతనిని భజింపుము. అట్లు త్యజించిన నీవు ఇతరుల ధనమునందు అపేక్షనుంపకుము. - ద్వాదశోపనిషత్తులు (వావిళ్ల)

శ్లో॥ అమృతత్వస్య నాశాస్తి విత్తేనేత్యేవ హి శ్రుతిః ।
బ్రవీతి కర్మణో ముక్తేరహేతుత్వం స్ఫుటం యతః ॥
- వివేకచూడామణిః 7

(ధనము ఉన్నందున ముక్తి చేకూరదు. కర్మచేతను ముక్తి లభించదు, ముక్తి త్యాగమువల్లనే చేకూరును.)

**త్యాగమనగా - 1) తనకు సంక్రమించిన / ఆర్జించిన భౌతికమైన సిరిసంపదలు; మరి 2) తనకుగల జ్ఞానసంపద ఎట్టి ప్రతిఫలాపేక్ష లేకుండా ఇతరులకు అందించుట.**



## 3

**అవతారిక :** 'శారీరికసుఖానికై జీవితాన్ని బలిచేయకు. సప్తధాతుమయమగు నశ్వర శరీరాన్ని మాటిమాటికి తలుచుకొని మోహపరవశుడవు కాకు' అని శ్రీశంకర భగవత్పాదులవారు ఈ శ్లోకమున చెప్పుచున్నారు.

**శ్లో॥ నారీస్తనభరనాభీదేశం**
**దృష్ట్వా మా గా మోహావేశమ్ ।**
**ఏతన్మాంసవసాదివికారం**
**మనసి విచిన్తయ వారం వారమ్ ॥ 3**

**పదవిభాగము :** నారీస్తనభరనాభీదేశమ్, దృష్ట్వా, మా, అగాః, మోహావేశమ్, ఏతత్, మాంస-వసాది-వికారమ్, మనసి, విచిన్తయ, వారమ్ వారమ్.

**అన్వయక్రమము :** నారీస్తనభరనాభీదేశం దృష్ట్వా మోహావేశం మా అగాః। ఏతత్ మాంస-వసాది-వికారమ్ (ఇతి) వారం వారం మనసి విచిన్తయ।

**ప్రతిపదార్థము :** (హే మూఢ! = ఓ మూఢుడా!)

నారీస్తనభరనాభీదేశమ్ = స్త్రీల ఘనస్తనములు, నాభిప్రాంతమును,
దృష్ట్వా = చూచి,
మోహావేశమ్ = పిచ్చిభ్రాంతిని,
మా-అగాః = పొందకు.
ఏతత్ = ఇది
మాంస-వస+ఆది-వికారమ్ (ఇతి) = మాంసము, క్రొవ్వు మొదలైనవాటి వికారమని,
వారం వారమ్ = మాటిమాటికి,
మనసి = మనసునందు
విచిన్తయ = జ్ఞప్తికి తెచ్చుకొనుము.... భజ గోవిందమ్.

**తాత్పర్యము :** స్త్రీల ఘనస్తనములు, నాభిప్రాంతమును – చూచి పిచ్చిభ్రాంతిని పొందకు. ఇది మాంసము, క్రొవ్వు మొదలైన వాటి వికారమని మాటిమాటికి మనసునందు జ్ఞప్తికి తెచ్చుకొనుము.

**సమాసాలు :** 1. నారీస్తనభరనాభీదేశమ్ – స్తనయోః భరః స్తనభరః। స్తనభరశ్చ నాభౌ చ స్తనభరనాభ్యౌ, తయోః దేశః స్తనభరనాభీదేశః। నార్యాః స్తనభరనాభీదేశః. నారీస్తనభర-నాభీదేశః, తం నారీస్తనభరనాభీదేశమ్।

2. మోహావేశమ్ – మోహస్య ఆవేశః మోహావేశః, తం మోహావేశమ్।

3. మాంసవసాదివికారమ్ – మాంసం చ వసా చ ఆదిః యేషాం తాని మాంసవసాదీని। తేషాం వికారః మాంసవసాదివికారః, తం మాంసవసాదివికారమ్।

**క్రియలు :** 1. మా గాః – 'ఇ' ధాతోః (ఇణ్ గతౌ) లుఙ్ పరస్మైపదే మధ్యమపురుషః, ఏకవచనమ్। అదాదిః, పరస్మైపదమ్, సకర్మకః।

ఇణో గా లుఙి, ఇతి ఇణో గాదేశః। లుఙి అడాగమనిషేధః।

| | | |
|---|---|---|
| అగాత్ | అగాతామ్ | అగుః |
| అగాః | అగాతమ్ | అగాత |
| అగామ్ | అగావ | అగామ |

శ్లో॥ భవజలధిమగాధం దుస్తరం నిస్తరేయం
కథమహమితి చేతో **మా** స్మ **గాః** కాతరత్వమ్ ।
సరసిజదృశి దేవే తావకీ భక్తిరేకా
నరకభిది నిషణ్ణా తారయిష్యత్యవశ్యమ్ ॥ 13
– ముకుందమాలాస్తోత్రమ్.

2. విచిన్తయ – వి ఉపసర్గపూర్వక 'చిన్త్' ధాతోః (చితి–చిన్త) స్మృత్యామ్। లోట్ పరస్మైపదే మధ్యమపురుషః, ఏకవచనమ్। చురాదిః, ఉభయపదమ్, సకర్మకః।

చిన్తతు / చిన్తయతు /
చిన్తతాత్ / చిన్తయతాత్    చిన్తతామ్ / చిన్తయతామ్    చిన్తన్తు / చిన్తయన్తు

చిన్త / **చిన్తయ** /

| | | |
|---|---|---|
| చిన్తతాత్ / చిన్తయతాత్ | చిన్తతమ్ / చిన్తయతమ్ | చిన్తత / చిన్తయత |
| చిన్తాని / చిన్తయాని | చిన్తావ / చిన్తయావ | చిన్తామ / చిన్తయామ |

శ్లో॥ కిం కరిష్యావహే వత్స! క్వ వా గచ్ఛావ లక్ష్మణ! ।
కేనోపాయేన గచ్ఛేయమ్ సీతామితి **విచిన్తయ** ॥ 3-67-3
– వాల్మీకీరామాయణే

(… సీతను ఏ ఉపాయముచేత పొందుదును' అను విషయమును ఆలోచించుము.)

**పదాదర్శము : 'నారీస్తనభరనాభీదేశం దృష్ట్వా మా గా మోహావేశమ్'**

శ్లో॥ పరదారాభిమర్శేషు ప్రవృత్తాన్ నౄన్ మహీపతిః ।
ఉద్వేజనకరైః దండైః చిహ్నయిత్వా ప్రవాసయేత్ ॥

(పరస్త్రీలను కోరుతూ వెంటాడుతూ, వేధించే పురుషులను పాలకుడు తీవ్రమైన దండనలచే శిక్షించి, దోషి యను చిహ్నములను వారిపై ముద్రించి, దేశాంతరములకు వెడలగొట్టవలయును.)

అటువంటివారిని హెచ్చరిస్తూ, శ్రీశంకరభగవత్పాదులవారు దృష్టిని గోవిందుని వైపు సారించి, జీవితాన్ని పండించుకోమంటున్నారు.

కాయల్గాచె వధూనఖాగ్రములచే గాయంబు, వక్షోజముల్
రాయన్రాపడె రొమ్ము, మన్మథక్లేశవిహారవిభ్రాంతిచే
ప్రాయంబాయెన్, బట్టగట్టితల, చెప్పన్ రోత సంసారమే
జేయంజాల, విరక్తు చేయగదవే, శ్రీకాళహస్తీశ్వరా!

(… సంసారములో పడి కొట్టుమిట్టాడుతున్న నన్ను నీవే విరక్తుని చేసి భవబంధమునుండి విముక్తుడిని చేయి స్వామీ! అని వాపోతున్నాడు కవి ధూర్జటి.



## 4

**అవతారిక :** శ్రీశంకరభగవత్పాదులవారు ఈ శ్లోకమున 'జీవితం క్షణభంగుర'మని తెలుపుచున్నారు.

**శ్లో॥ నలినీదలగతజలమతితరలం**
**తద్వజ్జీవితమతిశయచపలమ్ ।**
**విద్ధి వ్యాధ్యభిమానగ్రస్తం**
**లోకం శోకహతం చ సమస్తమ్ ॥ 4**

**పదవిభాగము :** నలినీదలగతజలమ్, అతితరలమ్, తద్వత్+జీవితమ్, అతిశయచపలమ్, విద్ధి, వ్యాధి+అభిమానగ్రస్తమ్, లోకమ్, శోకహతమ్, చ, సమస్తమ్.

**అన్వయక్రమము :** నలినీదలగతజలమ్ అతితరలమ్ (భవతి) । తద్వత్ జీవితమ్ అతిశయచపలమ్ (భవతి) । సమస్తం లోకం వ్యాధ్యభిమానగ్రస్తం శోకహతం చ (ఇతి) విద్ధి ।

**ప్రతిపదార్థము :** (హే మూఢ! = ఓ మూఢుడా!)

నలినీదలగతజలమ్ = తామరాకుమీది నీటిబిందువు,
అతితరలమ్ (భవతి) = మిక్కిలి చంచలముగా (ఉంటుంది).
తద్వత్ = అటులనే,
జీవితమ్ = జీవితము,
అతిశయచపలమ్ (భవతి) = మిక్కిలి చంచలముగా (ఉంటుంది).
సమస్తమ్ లోకమ్ = లోకమంతా,
వ్యాధి+అభిమానగ్రస్తమ్ = వ్యాధులకు; 'నేను–నాది' అనే అభిమానమునకు లోనయినదై,
శోకహతమ్ (ఇతి) = దుఃఖముతో సతమతమైనదనిన్ను,
విద్ధి = ఎఱుంగుము. ... భజ గోవిందమ్.

**తాత్పర్యము :** తామరాకుమీది నీటిబిందువు మిక్కిలి చంచలముగా ఉంటుంది. అటులనే జీవితమున్నూ. లోకమంతా వ్యాధులకు, 'నేను–నాది' అనే అభిమానమునకు లోనయినదై దుఃఖముతో సతమతమైనదనిన్ను ఎఱుంగుము.

**సమాసాలు :** 1. నలినీదలగతజలమ్ – నలిన్యాః దలం నలినీదలమ్। నలినీదలం గతం జలం నలినీదలగతజలమ్।

2. వ్యాధ్యభిమానగ్రస్తమ్ – వ్యాధ్యా అభిమానేన చ గ్రస్తః వ్యాధ్యభిమానగ్రస్తః, తం వ్యాధ్యభిమానగ్రస్తమ్।

3. శోకహతమ్ – శోకేన హతః శోకహతః, తం శోకహతమ్।

**క్రియలు :** 1. విద్ధి – 'విద్' ధాతోః (విద్జ్ఞానే) లోట్, పరస్మైపదే, మధ్యమపురుషః, ఏకవచనమ్, అదాదిః, పరస్మైపదమ్, సకర్మకః.

| | | |
|---|---|---|
| వేత్తు/విత్తాత్/విదాఙ్కరోతు/విదాఙ్కురుతాత్ | విత్తామ్/విదాఙ్కురుతామ్ | విదన్తు/విదాఙ్కుర్వన్తు |
| **విద్ధి**/విత్తాత్/విదాఙ్కురు/విదాఙ్కురుతాత్ | విత్తమ్/విదాఙ్కురుతమ్ | విత్త/విదాఙ్కురుత |
| వేదాని/విదాఙ్కరవాణి | వేదావ/విదాఙ్కరవావ | వేదామ్/విదాఙ్కరవామ |

శ్లో॥ ఆత్మానం రథినం **విద్ధి** శరీరం రథమేవతు ।
బుద్ధిం తు సారథిం **విద్ధి** మనః ప్రగ్రహమేవ చ ।.. కఠోపనిషత్తు

(ఆత్మ రథికుడు, శరీరం రథం, బుద్ధి సారథి, మనస్సు కళ్ళెం,... అని ఎఱుంగుము)

అ) విద్ – విద్యతే, సత్తాయామ్, దివాదిః, ఆత్మనేపదమ్, అకర్మకః ।

ఆ) విద్ – విన్దతి – విన్దతే, లాభే, తుదాదిః, ఉభయపదమ్, సకర్మకః ।

ఇ) విద్ – విన్తే, విచారణే, రుధాదిః, ఆత్మనేపదమ్, సకర్మకః ।

ఈ) విద్ – వేదయతే, వివాదే – ఆఖ్యానే – చేతనే – నివాసే – వేదనాయామ్; చురాదిః, ఆత్మనేపదమ్, సకర్మకః ।

**పదాదర్శము :** 1. స్వామి చిన్మయానందులవారు ఈ శ్లోకమును వ్యాఖ్యానిస్తూ, ఇది **'ప్రతిపక్షభావన'**కు చక్కని ఉదాహరణగా పేర్కొనినారు.

పాతంజలియోగసూత్రాలు – ఈ ప్రతిపక్షభావనను సాధనపాదమున దాని ప్రాముఖ్యతను సాధికారికముగా పేర్కొనినది. – **పాతంజలియోగసూత్రాలు** 2–33/34

**2–33 'వితర్కబాధనే ప్రతిపక్షభావనమ్'**

బాధించే తలపులను వాటికి వ్యతిరేకమైన భావాలతో తొలగించుకోవాలి.

**2–34 వితర్కా హింసాదయః కృతకారితానుమోదితాలోభక్రోధమోహపూర్వకా మృదుమధ్యాదిమాత్రాదుఃఖాజ్ఞానానంతఫలా ఇతి ప్రతిపక్షభావనమ్ ।**

యోగసాధనకు ప్రతిబంధకమైన హింసవంటి చర్యలు స్వయంకృతంగా గాని, ఇతరుల చర్యలవల్లగానీ సంభవిస్తాయి. కోపము, లోభము లేదా మోహము ఇత్యాదులవల్ల కలుగవచ్చు. అవి ఏ స్థాయిలోనైనా మహోధృతంగానో ఓ మోస్తరుగానో, సాధారణస్థాయిలో సాధకుని చర్యగా పరిణమించవచ్చు. అందుచేత ఆయా ప్రవృత్తులను వాటికి తగిన వ్యతిరేకభావనలతో అరికట్టవలయును.

2. జాగ్రదాష్టకంలోని ఈ దిగువ శ్లోకమును పరిశీలించండి.

శ్లో॥ జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునః పునః ।
సంసారసాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత జాగ్రత ॥

(చావుపుట్టుకలున్నంతకాలము) పుట్టడం దుఃఖముతో ప్రారంభమవుతుంది. భార్య దుఃఖహేతువు, ముసలితనము దుఃఖము, సంసారసాగరము దుఃఖమయముగా ఉంటుంది. అందువల్ల జాగ్రత్తపడు. 'దీపముండగానే ఇల్లు చక్కదిద్దుకో' అన్నట్లు దేహములో ప్రాణముండగానే తత్త్వవిచారణ చేయి. గోవిందుని సంపాదించుకొనుము. భవసాగరమునుండి బయల్పడు.

సాధకుడు సంసారములో ఉంటూనే, సంసారాన్ని మిథ్యగా తెలుసుకొని దానినుంచి అసంగంగా 'తామరాకుమీద నీటిబొట్టులా' ఉండాలి – అని అంటుంది.



**5**

**అవతారిక :** 'సంపాదించినంతకాలమే మర్యాద' అని శ్రీశంకరభగవత్పాదులవారు ఈ శ్లోకమున సూచిస్తున్నారు.

**శ్లో॥ యావద్విత్తోపార్జనసక్త -**
**స్తావన్నిజపరివారో రక్తః ।**
**పశ్చాజ్జీవతి జర్జరదేహే**
**వార్తాం కోఽపి న పృచ్ఛతి గేహే ॥ 5**

**పదవిభాగము :** యావత్, విత్త+ఉపార్జనసక్తః, తావత్, నిజపరివారః, రక్తః, పశ్చాత్, జీవతి, జర్జరదేహే, వార్తామ్, కః, అపి, న, పృచ్ఛతి, గేహే।

**అన్వయక్రమము :** యావత్ విత్త+ఉపార్జనసక్తః (భవతి), తావత్ నిజపరివారః రక్తః (భవతి) । జర్జరదేహే జీవతి పశ్చాత్ కః అపి గేహే వార్తాం న పృచ్ఛతి ।

**ప్రతిపదార్థము :** (హే మూఢ! = ఓ మూఢుడా!)

యావత్ = ఎంతవఱకయితే,
విత్త+ఉపార్జనసక్తః (భవతి) = ధనసంపాదనయందు శక్తియుతుడవుతాడో,
తావత్ = అంతవఱకే,
నిజపరివారః = తన 'మందిమార్బలము' అంతా,
రక్తః (భవతి) = అనురక్తి కలిగి ఉంటుంది.
జర్జరదేహే = సడలిన శరీరము కలిగి,
జీవతి = జీవిస్తున్నవాడవయిన,
పశ్చాత్ = పిమ్మట,
కోఽపి = ఎవరున్నూ, (ఇంకా),
గేహేఽపి = ఇంటిలోని వారున్నూ,
వార్తామ్ = 'ఏంటి, ఎలా ఉన్నావు' అనేది
న పృచ్ఛతి = అడుగటం ఉండదు. ...భజ గోవిందమ్.

**తాత్పర్యము :** ఎంతవఱకైతే ధనసంపాదనయందు శక్తియుతుడవుతాడో, అంతవఱకే తన 'మంది, మార్బలము' అంతా అనురక్తి కలిగి ఉంటుంది. సడలిన శరీరము కలిగి జీవిస్తున్నవాడైన పిమ్మట ఎవరున్నూ, ఇంటిలోని వారున్నూ, 'ఏంటి, ఎలా ఉన్నావు' అనేది అడుగటం ఉండదు.

**సమాసాలు :** 1. విత్తోపార్జనసక్తః – విత్తస్య ఉపార్జనం విత్తోపార్జనమ్ । తస్మిన్ సక్తః, విత్తోపార్జనసక్తః । తత్పురుషః ।

2. జర్జరదేహే – జర్జరః చ అసౌ దేహశ్చ జర్జరదేహః । తస్మిన్ జర్జరదేహే ।

**క్రియలు :** 1. జీవతి – 'జీవ్' ధాతోః (జీవప్రాణధారణే) లట్, పరస్మైపదే ప్రథమపురుషః, ఏకవచనమ్, భ్వాదిః, పరస్మైపదమ్, అకర్మకః.

| | | |
|---|---|---|
| **జీవతి** | జీవతః | జీవన్తి |
| జీవసి | జీవథః | జీవథ |
| జీవామి | జీవావః | జీవామః |

శ్లో॥ యస్మిన్ జీవతి జీవన్తి బహువః స తు జీవతి ।
కాకోఽపి కిం న కురుతే చఞ్చ్వాస్వోదరపూరణమ్ ॥
– పంచతంత్రమ్

(ఒక వ్యక్తి జీవించడం వల్ల అనేకమంది జీవనం పొందుతుంటే, అప్పుడు మాత్రమే ఆ వ్యక్తి నిజంగా జీవించినట్లు...)

2. పృచ్ఛతి – ప్రచ్ఛ ధాతోః (ప్రచ్ఛ జ్ఞీప్సాయామ్) లట్, పరస్మైపదే, ప్రథమపురుషః, ఏకవచనమ్, తుదాదిః, పరస్మైపదమ్, సకర్మకః.

| | | |
|---|---|---|
| **పృచ్ఛతి** | పృచ్ఛతః | పృచ్ఛన్తి |
| పృచ్ఛసి | పృచ్ఛథః | పృచ్ఛథ |
| పృచ్ఛామి | పృచ్ఛావః | పృచ్ఛామః |

శ్లో॥ యశ్చాధర్మేణ వై బ్రూయాద్యశ్చాధర్మేణ **పృచ్ఛతి**
తయోరన్యతరః ప్రైతి విద్వేషం చాధిగచ్ఛతి ॥
– మహాభారతే 1–3–91

**పదాదర్శము : 1. 'యావద్విత్తోపార్జనసక్తస్తావన్నిజపరివారో రక్తః'।**

అ) శ్లో॥ దారిద్ర్యాత్ పురుషస్య బాంధవజనో వాక్యే న సంతిష్ఠతే
సుస్నిగ్ధా విముఖీభవన్తి సుహృదః స్ఫారీభవంత్యాపదః।
సత్త్వం హ్రాసముపైతి శీలశశినః కాంతిః పరిమ్లాయతే
పాపం కర్మ చ యత్ పరైరపి కృతం తత్తస్య సంభావ్యతే॥
– శూద్రకకృతి

'దారిద్ర్యము వచ్చినచో ఆ పురుషుని మాటలను సన్నిహితబంధువులు కూడ మన్నించక త్రోసిపుత్తురు; అనురాగము కలవారున్నూ విముఖులగుదురు; ఆపదలు రెట్టించి పైబడును. శక్తి కొఱవడిపోవును, మానమర్యాదలు మరుగున బడిపోవును. ఇతరులు గావించిన దొసగులు కూడ యితనిపై ఆపాదించబడుతవి గదా! దారిద్ర్యమిన్ని విధముల మానవుని క్రుంగదీయును.

భజ గోవిందమ్ – గోవిందుని సంపాదించుకొనుము.

ఆ) ఆలుస్ బిడ్డలు తల్లిదండ్రులు ధనంబంచున్మహాబంధనం
బేలా నామెడ గట్టినాడవిక నిన్నేవేళం జింతింతు,
నిర్మూలంబైన మనంబులో నెగడు దుర్మోహాబ్ధిలో గ్రుంకి యీ
శీలాములపు జింతనెట్లుడిపెదో శ్రీకాళహస్తీశ్వరా!

'ఓ శ్రీకాళహస్తీశ్వరా! పెండ్లాము, పిల్లలు, తల్లి, తండ్రి యనియెడి మోహపాశముతో కట్టివేయబడిన నేను నీ నామస్మరణకూడ విస్మరించాను. కాబట్టి ఈ బంధాలు కలిగించిన నీవే వీటినుండి విడగొట్టాలి. అట్టి మోహపాశమును పోగొట్టి నీ స్వరూపధ్యానము నాకు ప్రసాదించవయ్యా' అని వాపోతున్నారు శ్రీధూర్జటి మహాకవి.

భజగోవిందమ్ – గోవిందుని సేవింపుము.



**6**

**అవతారిక :** శ్రీశంకరభగవత్పాదులవారు ఈ శ్లోకమున 'దేహమే నీదని బ్రతికావు, ప్రాణం పోయిన తరువాత ఏది దానికి మర్యాద' అని అడుగుతున్నారు

**శ్లో॥ యావత్పవనో నివసతి దేహే**
**తావత్పృచ్ఛతి కుశలం గేహే ।**
**గతవతి వాయౌ దేహాపాయే**
**భార్యాః బిభ్యతి తస్మిన్కాయే ॥ 6**

**పదవిభాగము :** యావత్, పవనః, నివసతి, దేహే, తావత్, పృచ్ఛతి, కుశలమ్, గేహే, గతివతి, వాయౌ, దేహాపాయే, భార్యా, బిభ్యతి, తస్మిన్కాయే ॥

**అన్వయక్రమము :** పవనః యావత్ దేహే నివసతి, తావత్ గేహే కుశలం పృచ్ఛతి । దేహాపాయే వాయౌ గతవతి (సతి), భార్యా తస్మిన్ కాయే బిభ్యతి ।

**ప్రతిపదార్థము :** (హే మూఢా! = ఓ మూఢుడా!)

పవనః = వాయువు, (ఊపిరి, జీవము),
యావత్ = ఎంతవఱకైతే,
దేహే = దేహమునందు,
నివసతి = ఉంటుందో,
తావత్ = అంతవఱకే
గేహే = ఇంటియందు
కుశలమ్ = 'ఏమిటి, ఎలా ఉన్నావు' అను క్షేమమును గూర్చి,
పృచ్ఛతి = అడుగుతారు.
దేహాపాయే = దేహానికి అపాయము కలిగిన స్థితిలో
వాయౌ = వాయువు (ఊపిరి, జీవము),
గతివతి (సతి) = పోయినట్టిది కాగా,
భార్యా (ః) = (నీ) సంబంధీకులు
తస్మిన్ కాయే = (నీ) ఆ శరీరమును గూర్చి
బిభ్యతి = భయపడిపోతుంటారు. ... భజ గోవిందమ్.

**తాత్పర్యము :** ఊపిరి ఎంతవరకైతే దేహమునందు ఉంటుందో, అంతవఱకే ఇంటియందు (నీ) క్షేమమును గూర్చి అడుగుతారు. ఊపిరి పోగానే, (నీ) సంబంధీకులు (నీ) ఆ శరీరమునుగూర్చి భయపడిపోతుంటారు.

**పాఠాంతరాలు :** 1. పవనో - జీవో

**సమాసాలు :** 1. దేహాపాయే - దేహస్య అపాయః దేహాపాయః । తస్మిన్ దేహాపాయే । షష్ఠీతత్పురుషః ।

**క్రియలు :** 1. నివసతి - ని ఉపసర్గపూర్వక 'వస్' ధాతోః (వస - నివాసే) లట్ పరస్మైపదే ప్రథమపురుషః, ఏకవచనమ్, భ్వాదిః, పరస్మైపదమ్, అకర్మకః

| | | |
|---|---|---|
| **ని-వసతి** | నివసతః | నివసన్తి |
| నివససి | నివసథః | నివసథ |
| నివసామి | నివసావః | నివసామః |

శ్లో॥ భజమానాన్భజస్వాస్మాన్కురు నః సాహ్యముత్తమమ్ ।
యా సా విద్యా **నివసతి** బ్రాహ్మణేఽమితతేజసి ॥
- మ.భా. 1-70-12

అ) వస - నివాసే, వసయతి - వసయతే, చురాదిః, ఉభయపదమ్, సకర్మకః।

ఆ) వస - ఆచ్ఛాదనే, వస్తే, అదాదిః, ఆత్మనేపదమ్, సకర్మకః ।

ఇ) వస - స్తమ్భే, వస్యతి, దివాదిః, పరస్మైపదమ్, అకర్మకః ।

ఈ) వస - అపహరణే, ఛేదనే, స్నేహనే; వాసయతి - వాసయతే, చురాదిః, ఉభయపదమ్, సకర్మకః ।

2. పృచ్ఛతి - 5వ శ్లోకవ్యాఖ్యానభాగము - చూడుడు

3. బిభ్యతి - 'భీ' ధాతోః (ఞిభీ భయే) లట్, పరస్మైపదే ప్రథమపురుషః బహువచనమ్, జుహోత్యాదిః, పరస్మైపదమ్, అకర్మకః.

| | | |
|---|---|---|
| బిభేతి | బిభితః / బిభీతః | బిభ్యతి |
| బిభేషి | బిభిథః / బిభీథః | బిభిథ / బిభీథ |
| బిభేమి | బిభివః / బిభీవః | బిభిమః / బిభీమః |

అ) శ్లో॥ విశుష్కకణ్ఠాహతశీకరామ్భసో
గభస్తిభిర్భానుమతోऽభితాపితాః ।
ప్రవృద్ధతృష్ణోపహతా జలార్థినో
న దన్తినః కేసరిణోऽపి **బిభ్యతి** ॥ – ఋతుసంహారకావ్యే-గ్రీష్మే-15

ఆ) శ్లో॥ న బిభేతి యదా చాయం యదా చాస్మాన్న **బిభ్యతి** ।
యదా నేచ్ఛతి న ద్వేష్టి బ్రహ్మసంపద్యతే తదా ॥
– మహాభారతే 1-69-56.



## 7

**అవతారిక :** 'ఎవరికిన్నీ పరమాత్మ చింతన లేదు' అని చెబుతూ శ్రీశంకరభగవత్పాదుల వారు 'ఇకనైనా భగవచ్చింతనలో ఉండాలని' ఈ శ్లోకమున సూచన చేయుచున్నారు.

**శ్లో॥ బాలస్తావత్క్రీడాసక్త -**
**స్తరుణస్తావత్తరుణీసక్తః ।**
**వృద్ధస్తావచ్చిన్తాసక్తః**
**పరమే బ్రహ్మణి కోऽపి న సక్తః ॥ 7**

**పదవిభాగము :** బాలః, తావత్, క్రీడాసక్తః, తరుణః, తావత్, తరుణీసక్తః, వృద్ధః తావత్, చింతాసక్తః, పరమే, బ్రహ్మణి, కః, అపి, న, సక్తః ।

**అన్వయక్రమము :** (యావత్) బాలః (సన్ అస్తి) తావత్ క్రీడాసక్తః (భవతి) । తరుణః తావత్ తరుణీసక్తః (భవతి) । వృద్ధః తావత్ చింతాసక్తః (భవతి) । పరమే బ్రహ్మణి కః అపి న సక్తః (భవతి) ।

**ప్రతిపదార్థము :** (హే మూఢ! = ఓ మూఢుడా!)
(యావత్ = ఎంతవరకైతే),
బాలః = బాల్యము,
(సన్ అస్తి = ఉంటుందో),
తావత్ = అంతవఱకు,

క్రీడాసక్తః = క్రీడలలో గడుపుతాడు

తరుణః = యవ్వనము

తావత్ = (ఎంతవరకైతే ఉంటుందో) అంతవఱకు,

తరుణీసక్తః = సంసారలంపటంలో (స్త్రీలవెంట) గడుపుతాడు.

వృద్ధః = వృద్ధాప్యము

తావత్ = (ఎంతవరకైతే ఉంటుందో) అంతవఱకు,

చిన్తాసక్తః = చీకాకుల్లో గడుపుతాడు

పరమే బ్రహ్మణి = పరంబ్రహ్మమునందు,

కోఽపి = ఎవరికిన్నీ

న సక్తః = ఆసక్తి ఉండదు గదా! ... భజ గోవిందమ్.

**తాత్పర్యము :** ఎంతవఱకైతే బాల్యము ఉంటుందో అంతవరకు క్రీడలలో గడుపుతాడు, ఎంతవఱకైతే యవ్వనము ఉంటుందో అంతవరకు సంసారలంపటంలో గడుపుతాడు. ఎంతవఱకైతే వృద్ధాప్యము ఉంటుందో అంతవరకు చీకాకుల్లో గడుపుతాడు. పరంబ్రహ్మమునందు ఎవరికిన్నీ ఆసక్తి ఉండదు గదా!

**సమాసాలు :** 1. క్రీడాసక్తః – క్రీడాయాం సక్తః క్రీడాసక్తః ।

2. తరుణీసక్తః – తరుణ్యాం సక్తః తరుణీసక్తః ।

3. చిన్తాసక్తః – చిన్తాయాం సక్తః చిన్తాసక్తః ।

4. సక్తః – సజ్జ ధాతోః (సజ్జసంగే) క్తాన్తం రూపమ్ ।

**పదాదర్శము : బాలః ... సక్తః**

అ) శ్లో॥ క్షణం బాలో భూత్వా క్షణమపి యువా కామరసికః
క్షణం విత్తైర్హీనః క్షణమపి చ సంపూర్ణవిభవః ।
జరాజీర్ణైరంగైః నట ఇవ వలీమండితతను–
ర్నరస్సంసారాంతే విశతి యమధానీయవనికామ్ ॥

– భర్తృహరివైరాగ్య–50

'మానవులు నటులవలె వివిధ పాత్రలను కొంత కొంత సేపు ధరించి చివరకు నిష్క్రమిస్తారు. కొంతకాలము పసివారుగను, కొంతకాలము రసికయువకులుగను, కొంతకాలము ధనహీనులుగను, మరికొంతకాలము సంపద్వంతులుగాను, చివరకు అవయవములు శక్తిహీనములు కాగా ఒడలంతా ముడుతలు పడి, వడకుచు దీనులుగాను, చివరికి యమపురిని చేరుతున్నారు'. భజ గోవిందమ్ .... గోవిందుని సేవించుము.

ఆ) శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః ।
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥ భగవద్గీత 2-20

ఆత్మ - జన్మరహితమైనది, నిత్యమైనది, శాశ్వతమైనది, సనాతనమైనది. 'మార్పుకు లోనుగానిది'

ఇ) కఠోపనిషత్తులోని ఒక మంత్రము దాదాపు ఈ భగవద్గీతా శ్లోకము (2-20) లాగానే ఉంటుంది. ఆత్మకు మార్పు ఉండదు అని అంటుంది.

న జాయతే మ్రియతే వా విపశ్చిత్
నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్ ।
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥ 1-2-18

ఈ) మఱి శరీరము షడ్వికారాలకు లోనవుతుంది. అవి అస్తి, జాయతే, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే, వినశ్యతి.

శ్రీశంకరభగవత్పాదులవారు 'తత్త్వబోధ'లో దీని గుఱించి ఈవిధంగా చెబుతారు. శరీరం సుఖదుఃఖాలకు నివాసస్థానము. షడ్వికారాలకు లోబడి ఉంటుంది.

1. అస్తి - తల్లి గర్భములో అండరూపములో ఉండటం.
2. జాయతే - పుట్టడం.
3. వర్ధతే - పెరగటం
4. విపరిణమతే - మార్పు చెందటం
5. అపక్షీయతే - శుష్కించటం
6. వినశ్యతి - నశించుట.

ఉ) రోసీరోయదు కామినీజనుల తారుణ్యోరుసౌఖ్యంబులన్
పాసీపాయదు పుత్త్రమిత్రజనసంపద్భ్రాంతి వాంఛాలతల్
కోసీకోయదు నామనంబకట! నీకున్ ప్రీతిగా సత్క్రియల్
చేసీచేయదు దీని త్రుళ్ళణచవే శ్రీకాళహస్తీశ్వరా!

ఓ శ్రీకాళహస్తీశ్వరా! స్త్రీల యవ్వనసుఖములందూ, పుత్త్రులు, స్నేహితులు ధనముపట్ల భ్రాంతి తొలగినట్లే తొలగి మళ్ళీ చిగురిస్తుంది. కోర్కెలనే తీగలను త్రుంచినా మళ్లీ చిగురులు వేస్తున్నాయి. అలా కాకుండా నిశ్చలమైన బుద్ధిని మాలో ప్రబోధనము చేయి స్వామీ! అని వాపోతున్నాడు మహాకవి శ్రీధూర్జటి.

భజ గోవిందమ్ – గోవిందుని సేవించుకొనుము.



## 8

**అవతారిక :** 'బంధములో పడి కొట్టుకుంటున్న నీ స్వరూపమేమిటో తత్త్వవిచారణ చేసి దానినుండి బయటపడు నాయనా' అని శ్రీశంకరభగవత్పాదులవారు ఈ శ్లోకమున ఉద్బోధిస్తున్నారు.

**శ్లో॥ కా తే కాన్తాః కస్తే పుత్త్రః?**
**సంసారోఽయమతీవ విచిత్రః ।**
**కస్య త్వమ్? కః కుత ఆయాత –**
**స్తత్త్వం చిన్తయ తదిహ భ్రాతః! ॥ 8**

**పదవిభాగము :** కా, తే, కాన్తా?, కః, తే, పుత్త్రః, సంసారః, అయమ్, అతీవ, విచిత్రః । కస్య, త్వమ్?, కుతః, ఆయాతః?, తత్త్వమ్, చిన్తయ, తత్, ఇహ, భ్రాతః! ।

**అన్వయక్రమము :** హే భ్రాతః! తే కాన్తా కా? తే పుత్త్రః కః? త్వం కస్య? (త్వం) కః? (త్వం) కుతః ఆయాతః? తత్ తత్త్వమ్ ఇహ చిన్తయ ।

**ప్రతిపదార్థము :** (హే మూఢ! = ఓ మూఢుడా!)
హే భ్రాతః! = ఓ ఏకగర్భజాతుడా!

తే కాన్తా కా? = ఎవరు నీ కాంత?
తే పుత్త్రః కః? = ఎవరు నీ బిడ్డ?
త్వం కస్య? = ఎవరివాడవు నీవు?
త్వం కః? = ఎవడవు నీవు?
త్వం కుతః ఆయాతః = ఎక్కడనుండి వచ్చినవాడవు నీవు?
తత్ తత్త్వమ్ ఇహ చిన్తయ = ఇచటనే ఈ తత్త్వాన్ని విచారింపుము...
భజ గోవిందమ్.

**తాత్పర్యము :** హే భ్రాతః! ఎవరు నీ కాన్త? ఎవరు నీ బిడ్డ?, ఎవరివాడవు నీవు? ఎవడవు నీవు? ఎక్కడనుండి వచ్చినవాడవు నీవు? ఇచటనే ఈ తత్త్వాన్ని విచారింపుము.

పాఠాంతరాలు : 1. తదిహ – యదిదమ్, 2. భ్రాతః! – భ్రాంతః ।

**క్రియలు :** 3వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు – **చిన్తయ**

**పదాదర్శము : సంసారః** – సమ్యక్ సరతీతి **సంసారః**, ఎడతెగక పారునది సంసారము.

అ) శ్లో॥ సంసార విషవృక్షస్య, ద్వే ఫలే అమృతోపమే ।
కావ్యామృతరసాస్వాదః, సంగమస్సజ్జనైస్సదా ॥
– హితోపదేశః 1-146

సంసారమనే యీ విషవృక్షమున రెండే రెండు అమృతఫలములున్నవి. మొదటిది కావ్యామృతరసాస్వాదనమున్ను, రెండవది సత్పురుషసహవాసమున్ను.

ఆ) శ్లో॥ సంసారసర్పదష్టానాం, జంతూనామవివేకినామ్ ।
చంద్రశేఖరపాదాబ్జస్మరణం పరమౌషధమ్ ॥ మార్కండేయ స్తోత్రమ్

సంసారమనే విషసర్పముచే కాటువేయబడి, మెలుకువ లేకుండా పోయిన అవివేకజంతువులకు చంద్రశేఖరుని పాదాబ్జస్మరణము తక్క వేఱు ఔషధము లేదు.

భజ గోవిందమ్ – గోవిందుని సేవింపుము.

ఇ) శ్లో॥ **సంసారే** కిం సారం, కంసారేశ్చరణకమలపరిభజనమ్ ।
జ్యోతిః కిమంధకారే, యదంధకారేరనుస్మరణమ్ ॥
– శ్రీకృష్ణకర్ణామృతమ్ 2-80

ఈ) శ్లో॥ అసారే ఖలు **సంసారే** సారం శ్వశురమన్దిరమ్ ।
క్షీరాబ్ధౌ చ హరిః శేతే శివః శేతే హిమాలయే ॥
– సంస్కృతసూక్తిరత్నకోశః 7

"సారహీనమైన ఈ సంసారములో సారమైనది మామగారి ఇల్లే, అందుచేతనే శ్రీమహావిష్ణువు క్షీరసముద్రములో (లక్ష్మీదేవి పుట్టిల్లు) శయనిస్తున్నాడు. శివుడు హిమాలయంమీద (హిమాలయంలో భాగమైన కైలాసం మీద) శయనిస్తున్నాడు. (ఇద్దరూ మామల దగ్గఱే). తత్త్వవిచారణ చేయండి. శివకేశవులను చేరండి.



## 9

**అవతారిక :** శ్రీశంకరభగవత్పాదులవారు ఈ శ్లోకమున **'తత్త్వచింతన'**ను అందించారు.

**శ్లో॥ సత్సఙ్గత్వే నిస్సఙ్గత్వం**
**నిస్సఙ్గత్వే నిర్మోహత్వమ్ ।**
**నిర్మోహత్వే నిశ్చలతత్త్వం**
**నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥ 9**

**పదవిభాగము :** సత్సఙ్గత్వే, నిస్సఙ్గత్వమ్, నిస్సఙ్గత్వే, నిర్మోహత్వమ్, నిర్మోహత్వే, నిశ్చలతత్త్వమ్, నిశ్చలతత్త్వే, జీవన్ముక్తిః.

**అన్వయక్రమము :** సత్సఙ్గత్వే నిస్సఙ్గత్వమ్ । నిస్సఙ్గత్వే నిర్మోహత్వమ్ । నిర్మోహత్వే నిశ్చలతత్త్వమ్ । నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ।

**ప్రతిపదార్థము :** (హే మూఢ! = ఓ మూఢుడా!)

సత్సఙ్గత్వే = సత్సంగము వల్ల,
నిస్సఙ్గత్వమ్ = నిస్సంగత్వము చేకూరుతుంది.
నిస్సఙ్గత్వే = నిస్సంగత్వము వల్ల,
నిర్మోహత్వమ్ = నిర్మోహత్వము ఏర్పడుతుంది.
నిర్మోహత్వే = నిర్మోహత్వము వల్ల,
నిశ్చలతత్త్వమ్ = నిశ్చలతత్త్వము సమకూరుతుంది.

నిశ్చలతత్త్వే = నిశ్చలతత్త్వమే
జీవన్ముక్తిః = జీవన్ముక్తి (అలజడులు కానరాని స్థితి).

**తాత్పర్యము :** 'జీవించి ఉండగనే ఆనందముగా ఎటువంటి ఒడిదుడుకులు లేకుండా జీవించటమే' – జీవన్ముక్తి.

**పాఠాంతరాలు :** 1. నిశ్చలతత్త్వమ్ – నిశ్చలచిత్తమ్; 2. నిశ్చలతత్త్వే – నిశ్చలచిత్తే.

**సమాసాలు :** 1. సత్సంగత్వే – సద్భిః సంగః అస్యాస్తీతి సత్సంగః । తస్య భావః సత్సంగత్వమ్ తస్మిన్ సత్సంగత్వే ।

2. నిస్సఙ్గత్వమ్ – నిర్గతః సంగః యస్మాత్ సః నిస్సంగః । తస్య భావః నిస్సంగత్వమ్.

3. నిర్మోహత్వమ్ – నిర్గతః మోహః యస్మాత్ సః నిర్మోహః । తస్య భావః నిర్మోహత్వమ్।

4. నిశ్చలతత్త్వమ్ – నిర్గతః చలః (చలనం) యస్మాత్ తత్ నిశ్చలమ్ । తస్య భావః తత్త్వమ్ । నిశ్చలశ్చ తత్ తత్త్వం చ । నిశ్చలతత్త్వమ్ । కర్మధారయః ।

5. జీవన్ముక్తిః – జీవిత ఏవ ముక్తిః జీవన్ముక్తిః ।

**పదాదర్శము : జీవన్ముక్తిః** – ఇక్కడే ఇప్పుడే జీవించి ఉండగనే ఆనందంగా ఎటువంటి ఒడిదుడుకులు లేకుండా జీవించడం.

అ) శ్రీశంకరభగవత్పాదులవారు వివేకచూడామణి గ్రంథములో దైవానుగ్రహము వల్లే మూడు విషయాలు సంభవమవుతాయని అంటారు.

శ్లో॥ దుర్లభం త్రయమేవైతద్ దేవానుగ్రహహేతుకమ్ ।
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః ॥

మానవుడిగా జన్మించడం చాలా అరుదు. కొన్ని కోట్ల జీవరాశులల్లో మనుష్యజన్మ చాలా విశిష్ఠమైనదిగా చెప్పబడినది. ఈ మానవజన్మ ద్వారానే జన్మరాహిత్యానికి దారి దొరుకుతుంది సులువుగా. ఇటువంటి మానవజన్మను పొందిన వారిలో కూడా మోక్షేచ్ఛ ఉండటం యింకా చాలా అరుదుగానే ఉంటుంది. ఇలా మోక్షేచ్ఛ ఉన్నవారిలో ఏ ఒక్కనికో సన్మార్గం వైపుకు తీసుకొని వెళ్లే సద్గురువు లభించడం యింకా యింకా చాలా అరుదుగానే ఉంటుంది.

మానవుడు పుట్టినందునకు మన జీవితలక్ష్యము ఏమిటి? సమదర్శనత్వము. ఈ చరాచరప్రపంచమును భగవన్మయముగా గ్రహించి, అంతటా తన్ను తాను చూచుకోవటం, తనకన్నా వేఱైనదేదియు కించిత్తు లేదనే అనుభవమును పొందటం. సాధనచతుష్టయమును సద్గురువు నాశ్రయించుట ద్వారా అభ్యసించుటయే పరమావధిగా నెంచవలయును.

భజ గోవిందమ్ – గోవిందుని సంపాదించుకొనుము.

ఆ) శ్లో॥ సత్సంగశ్చ వివేకశ్చ నిర్మలం నయనద్వయమ్ ।
యస్య నాస్తి నరః సోఽన్ధః కథం న స్యాదమార్గగః ॥
– గరుడపురాణే

సత్సంగము, వివేకము మానవుని మలినరహితమగు ఆరోగ్యకరములగు రెండు నేత్రములు. ఆ రెండు గుణములు లేనియెడల ఆ రెండు కళ్ళు గ్రుడ్డివే. గ్రుడ్డికళ్ళతో చూడవలసినది, చూడగలిగినది ఏమీ ఉండదు.

అంధత్వము ఆవరించి ఉన్నంతవరకు వాల్మీకి మారలేదు. ఎప్పుడైతే సప్తర్షి సాంగత్యము లభించినదో అప్పుడే మహర్షి, ఆదికవి; ఐనాడు.



## 10

**అవతారిక :** 'అజ్ఞాననిర్మూలనము వల్ల సంసారలంపటము ఉండ'దని శ్రీశంకర భగవత్పాదులవారు ఈ శ్లోకమున విశదీకరిస్తున్నారు.

**శ్లో॥ వయసి గతే కః కామవికారః?**
**శుష్కే నీరే కః కాసారః? ।**
**క్షీణే విత్తే కః పరివారో**
**జ్ఞాతే తత్త్వే కః సంసారః? ॥ 10**

**పదవిభాగము :** వయసి, గతే, కః, కామవికారః, శుష్కే, నీరే, కః, కాసారః, క్షీణే, విత్తే, కః, పరివారః, జ్ఞాతే, తత్త్వే, కః, సంసారః ।

**అన్వయక్రమము :** వయసి గతే (సతి) కః కామవికారః? శుష్కే నీరే (సతి) కాసారః? క్షీణే విత్తే (సతి) కః పరివారః? తత్త్వే జ్ఞాతే (సతి) కః సంసారః?

**ప్రతిపదార్థము :** (హే మూఢ! = ఓ మూఢుడా!)

వయసి గతే (సతి) = వయస్సు మళ్ళిన (పిమ్మట)ది కాగా,
కః కామవికారః? = కామవికారమెక్కడ?
శుష్కే నీరే (సతి) = నీరు ఎండిన (పిమ్మట)ది కాగా,
కః కాసారః? = చెఱువెక్కడ?
క్షీణే విత్తే (సతి) = ధనము ఖర్చుఐన (పిమ్మట)ది కాగా,
కః పరివారః = పరివారమెక్కడ?
తత్త్వే జ్ఞాతే (సతి) = తత్త్వము తెలిసిన (పిమ్మట)ది కాగా,
కః సంసారః = సంసారమెక్కడ? ... భజ గోవిందమ్.

**తాత్పర్యము :** సుస్పష్టము.

**సమాసాలు :** 1. కామవికారః – కామస్య వికారః కామవికారః, షష్ఠీతత్పురుషః ।

2. గతే – 'గమ్' ధాతోః (గమ్లు గతౌ) క్తాన్తం సప్తమీ, ఏకవచనమ్ ।

3. జ్ఞాతే – 'జ్ఞా' ధాతోః (జ్ఞా అవబోధనే) క్తాన్తం, సప్తమీ, ఏకవచనమ్ ।

**పదాదర్శము :** 1. **వయసి గతే ...**

శ్లో॥ నిర్వాణే దీపే కిము తైలదానమ్?
చోరే గతే వా కిము సావధానమ్? ।
**వయోగతే** కిం వనితావిలాసః?
పయోగతే కిం ఖలు సేతుబంధః? ॥

– సంస్కృతసూక్తిరత్నకోశః (2)–284

ఏదైనా సకాలంలో చేస్తే మంచి ఫలితాలు కనబడతాయి. లేకుంటే ఎలా ఉంటుందో ఈ పై శ్లోకము చెబుతుంది.

దీపం ఆరిపోయిన తరువాత నూనె పోయడం ఎందుకు?
దొంగిలించుకు పోయిన తరువాత మేల్కొనటంవలన ప్రయోజనమేమి?
వయసు అయిపోయిన తరువాత స్త్రీవ్యామోహం ఎందుకు?

నీళ్ళు పోయిన తరువాత గట్టువేయడం వలన ప్రయోజనమేమి? – అంటే సకాలములో జాగ్రత్త పడక తరువాత ఎంత కృషి చేసినా ఏం లాభము? అందుకే మన పెద్దలు 'జీవముండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలన్నారు గదా'.

ముందుగనే; భజ గోవిందమ్, గోవిందుని సంపాదించుకొనుము.

**2) జ్ఞాతే తత్త్వే కః సంసారః?**

అ) స యో హ వై తత్పరం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి నాస్యా బ్రహ్మవిత్ కులే భవతి । తరతి శోకం తరతి పాప్మానం గుహాగ్రన్థిభ్యో విముక్తోఽమృతో భవతి ।

– ముండకోపనిషత్తు 3-2-9

ఎవడు ఆ బ్రహ్మమును పొందుచున్నాడో వారు బ్రహ్మమే అగుచున్నాడు. వాని కుటుంబమునందు అజ్ఞాని యెవడు నుండడు. శోకమునుండి తరించుచున్నాడు. పాపము లేనివాడగుచున్నాడు. ఆశాపాశరహితుడగుచున్నాడు. పరంబ్రహ్మస్వరూపి యగుచున్నాడు. – ద్వాదశోపనిషత్తులు (వావిళ్లప్రతి).

3) "ముక్తినొందుటకు ఆత్మదర్శనము తప్ప వేఱే ఉపాయము లేదు' అని అంటుంది – శ్వేతాశ్వతరోపనిషత్తు 6-15.

"ఏకో హంసో భువనస్యాస్య మధ్యే స ఏవాగ్నిః సలిలే సంనివిష్టః ।
తమేవ విదిత్వా అతి మృత్యుమేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ ॥

భజ గోవిందమ్ – గోవిందుని సంపాదించుకొనుము.



## 11

**అవతారిక :** 'కాలము అన్నింటినీ హరిస్తుంది' అని ఈ శ్లోకమున శ్రీశంకర భగవత్పాదులవారు చెబుతూ 'సమయము మించకముందే బ్రహ్మపదమువైపు అడుగులు వేయండి' అని అంటున్నారు.

**శ్లో॥ మా కురు ధనజనయౌవనగర్వం**
**హరతి నిమేషాత్కాలస్సర్వమ్ ।**
**మాయామయమిదమఖిలం హిత్వా**
**బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా ॥ 11**

**పదవిభాగము :** మా, కురు, ధన-జన-యౌవన-గర్వమ్, హరతి, నిమేషాత్, కాలః, సర్వమ్ । మాయామయమ్, ఇదమ్, అఖిలమ్, హిత్వా, బ్రహ్మపదమ్, త్వమ్, ప్రవిశ, విదిత్వా ।

**అన్వయక్రమము :** ధన-జన-యౌవన-గర్వం మా కురు । నిమేషాత్ కాలః సర్వం హరతి । ఇదమ్ అఖిలం మాయామయమ్ (ఇతి) బుద్ధ్వా బ్రహ్మపదం విదిత్వా త్వం ప్రవిశ ।

**ప్రతిపదార్థము :** (హే మూఢ! = ఓ మూఢుడా!)

ధన-జన-యౌవన-గర్వమ్ = సంపాదన, పరివారము, వయస్సు ఎడల యేర్పడే గర్వమును
మా కురు – వదిలివేయుము.
నిమేషాత్ = క్షణంలో
కాలః = కాలము
సర్వం హరతి = సర్వాన్నీ హరిస్తుంది
ఇదమ్ అఖిలమ్ = ఈ సమస్త జగత్తు
మాయామయమ్ (ఇతి) = మిథ్య అని,
బుద్ధ్వా = గ్రహించి,
బ్రహ్మపదమ్ విదిత్వా = బ్రహ్మపదమును అనుభూతికి తెచ్చుకొని,
త్వమ్ ప్రవిశ = నీవందుండిపో.

**తాత్పర్యము :** సంపాదన-పరివారము-వయసు ఎడల ఏర్పడే గర్వమును వదిలివేయుము. క్షణములో కాలము సర్వాన్నీ హరిస్తుంది. ఈ సమస్త జగత్తు మిథ్య అని గ్రహించి, బ్రహ్మపదమును అనుభూతికి తెచ్చుకొని నీవందుండిపో.

**పాఠాంతరాలు :** 1. హిత్వా – బుద్ధ్వా

**సమాసాలు :** 1. ధనజనయౌవనగర్వమ్ – ధనే జనయౌవనే చ గర్వః ధనజనయౌవన గర్వః । తం ధనజనయౌవనగర్వమ్।

2. మాయామయమ్ – మాయాయా వికారః మాయామయమ్ ।

**క్రియలు :** 1. కురు – 2వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

2. ప్రవిశ – ప్ర ఉపసర్గపూర్వక విశ్ ధాతోః (విశ ప్రవేశనే) లోట్ పరస్మైపదే మధ్యమపురుషః, ఏకవచనమ్, తుదాదిః, పరస్మైపదమ్, సకర్మకః ।

| | | |
|---|---|---|
| ప్ర–విశతు / ప్రవిశతాత్ | ప్రవిశతామ్ | ప్రవిశన్తు |
| **ప్ర–విశ** / ప్రవిశతాత్ | ప్రవిశతమ్ | ప్రవిశత |
| ప్రవిశాని | ప్రవిశావ | ప్రవిశామ |

**ప్రవిశ** రాధే మాధవ సమీపమిహ...
మంగళశతాని **కురు** మురారే
మాధవ సమీపమిహ మంగళశతాని
**కురు** మురారే మురారే **ప్రవిశ** రాధే ॥
మఞ్జుతరకుఞ్జతలకేళిసదనే
ఇహ విలసరతిరభసహసితవదనే మురారే ॥ప్రవిశ॥
విహితపద్మావతీసుఖసమాజే
భణతి **జయదేవకవి**రాజరాజే మురారే మురారే ॥ప్రవిశ॥

– గీతగోవిందకావ్యమ్.

**పదాదర్శము : మా కురు... విదిత్వా ।**

అ) ఏమి చెబుతుందో చూడండి. 'తస్మాత్ జాగ్రత జాగ్రత'.

శ్లో॥ క్షణం విత్తం క్షణం చిత్తం క్షణం జీవితమావయోః ।
యమస్య కరుణా నాస్తి తస్మాత్ జాగ్రత జాగ్రత ॥ 6 ॥

ధనము, బుద్ధి, జీవితము – క్షణభంగురములు. యముడు సమయము రాగానే తీసుకువెళ్లిపోతాడు. ఎటువంటి కరుణ చూపడు. ఎంతో జాగరూకతతో ఉండు. సమయాన్ని వృథా చేసుకోవద్దు. ఈలోపునే 'ఆధ్యాత్మికప్రగతి' సాధించు.

ఈ సమస్త జగత్తంతా 'మాయామయం' (మిథ్య) అని గ్రహించు. తరువాత సంసారము (చావుపుట్టుకలు) లేదు.

ఆ) సమ్పదః స్వప్నసంకాశాః యౌవనం కుసుమోపమమ్ ।
విద్యుచ్చంచల ఆయుషం తస్మాత్ జాగ్రత జాగ్రత ॥ 5 ॥

సంపదలు కలలలాంటివి, కరిగిపోతాయి, మాయమైపోతాయి, యౌవనం పూవువలె తొందరగా వడలిపోతుంది. ఆయుష్షు మెరుపులాగ మెరసి ముణిపించి క్షణభంగురమవుతుంది. కాబట్టి సావధానుడవు కమ్ము.

భజ గోవిందమ్ – గోవిందుని సంపాదింపుము.



## 12

**అవతారిక :** 'ఇకనైనా మేల్కొని 'సచ్చింతన' చేయండి' అని ఈ శ్లోకమున శ్రీశంకర భగవత్పాదులవారు ఉపదేశిస్తున్నారు.

**శ్లో॥ దినయామిన్యౌ సాయం ప్రాతః**
**శిశిరవసన్తౌ పునరాయాతః ।**
**కాలః క్రీడతి గచ్ఛత్యాయు –**
**స్తదపి ముఞ్చత్యాశావాయుః ॥ 12**

**పదవిభాగము :** దినయామిన్యౌ, సాయమ్, ప్రాతః, శిశిర–వసన్తౌ, పునః, ఆయాతః । కాలః, క్రీడతి, గచ్ఛతి, ఆయుః, తత్, అపి, న, ముంచతి, ఆశావాయుః ।

**అన్వయక్రమము :** దినయామిన్యౌ (ఆయాతః)। సాయం ప్రాతః (ఆయాతః), శిశిర–వసన్తౌ పునః (ఆయాతః) । కాలః క్రీడతి । తత్ అపి ఆశావాయుః న ముంచతి ।

**ప్రతిపదార్థము :** (హే మూఢ! = ఓ మూఢుడా!)

దినయామిన్యౌ = పగలు, రాత్రి;
సాయం ప్రాతః = సాయంకాలం, ప్రాతఃకాలం;
శిశిర–వసన్తౌ = శిశిర ఋతువు, వసంత ఋతువు;
పునరాయాతః = మళ్ళీ మళ్ళీ వస్తున్నాయి పోతున్నాయి.
కాలః క్రీడతి = కాలము ఆడుకుంటుంది.

గచ్ఛతి + ఆయుః = ఆయుష్షు వెళ్లిపోతుంది.

తదపి = అయినా సరే

ఆశావాయుః = ఆశయనెడి ఊపిరి,

న ముంచతి = వదలటం లేదు. ... భజ గోవిందమ్.

**తాత్పర్యము :** పగలు–రాత్రి, సాయంకాలము–ప్రాతఃకాలం, శిశిర ఋతువు–వసంత ఋతువు; మళ్ళీ మళ్ళీ వస్తున్నాయి – మళ్ళీ మళ్ళీ పోతున్నాయి. కాలం సాగిపోతుంది. ఆయుష్షు వెళ్ళిపోతుంది. అయినా ఆశ వదలటం లేదు.

**పాఠాంతరాలు :** 1. దినయామిన్యౌ – దినమపి రజనీ

**సమాసాలు :** 1. శిశిరవసన్తౌ – శిశిరశ్చ వసంతశ్చ శిశిరవసన్తౌ । ద్వంద్వసమాసః ।

2. ఆశావాయుః – ఆశా ఏవ వాయుః ఆశావాయుః.

**క్రియలు :** 1. ఆయాతః – ఆ (ఆఙ్) ఉపసర్గపూర్వక 'యా' ధాతోః (యా ప్రాపణే) లట్ పరస్మైపదే ప్రథమపురుషః, ద్వివచనమ్, అదాదిః, పరస్మైపదమ్, సకర్మకః.

| | | |
|---|---|---|
| యాతి | **యాతః** | యాన్తి |
| యాసి | యాథః | యాథ |
| యామి | యావః | యామః |

2. క్రీడతి – క్రీడ్ ధాతోః (క్రీడ్ విహారే) లట్ పరస్మైపదే ప్రథమపురుషః ఏకవచనమ్, భ్వాదిః, పరస్మైపదమ్, అకర్మకః.

| | | |
|---|---|---|
| **క్రీడతి** | క్రీడతః | క్రీడన్తి |
| క్రీడసి | క్రీడథః | క్రీడథ |
| క్రీడామి | క్రీడావః | క్రీడామః |

**క్రీడతి** వనమాలీ గోష్ఠే
**క్రీడతి** వనమాలీ ॥
ప్రహ్లాద పరాశర పరిపాలీ
పవనాత్మజ జాంబవదనుకూలీ ॥

పద్మాకుచ పరిరంభణశాలీ
పటుశరశాసిత మాలిసుమాలీ ॥
పరమహంసవర కుసుమసుమాలీ
ప్రణవ పయోరుహ గర్భకపాలీ ॥ – **శ్రీసదాశివబ్రహ్మేంద్రకీర్తన**

3. గచ్ఛతి – గమ్ ధాతోః (గమ్ల గతౌ) లట్ పరస్మైపదే ప్రథమపురుషః ఏకవచనమ్, భ్వాదిః, పరస్మైపదమ్, సకర్మకః ।

| | | |
|---|---|---|
| **గచ్ఛతి** | గచ్ఛతః | గచ్ఛన్తి |
| గచ్ఛసి | గచ్ఛథః | గచ్ఛథ |
| గచ్ఛామి | గచ్ఛావః | గచ్ఛామః |

శ్లో॥ పార్థ! నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।
న హి కల్యాణకృత్కశ్చిత్ దుర్గతిం తాత! గచ్ఛతి ॥

(... ఓ ప్రియమిత్రమా! భగవత్ప్రాప్తికోసం ప్రయత్నం చేసేవాడు ఎన్నటికి దుర్గతి పాలుకాడు.)

4. ముఞ్చతి – 'ముచ్' ధాతో (ముచ్లృ మోచనే) లట్ పరస్మైపదే ప్రథమపురుషః, ఏకవచనమ్, తుదాదిః, ఉభయపదమ్, సకర్మకః.

(6. ముచ్, 7. విద్, 8. సిచ్ ధాతువులకు శేముచాదీనామ్ (సూ. 7-1-59) అను సూత్రముచే నుమ్ (న్) ఆగమము చెప్పబడినది.

ముచ్+అ+తి – మున్చ్+అ+తి – ముంచ్+అ+తి
(నకారమునకు అనుస్వారము) – ముఞ్చ్+అ+తి (అనుస్వారమునకు పరసవర్ణము) – ముఞ్చతి ।

| | | |
|---|---|---|
| **ముఞ్చతి** | ముఞ్చతః | ముఞ్చన్తి |
| ముఞ్చసి | ముఞ్చథః | ముఞ్చథ |
| ముఞ్చామి | ముఞ్చావః | ముఞ్చామః |

సా విరహే తవ దీనా ...
విలసతి హసతి విషీదతి రోదితి చంచతి **ముఞ్చతి** తాపమ్ ।
సా విరహే తవ దీనా – గీతగోవిందకావ్యమ్ 8-6

**పదాదర్శము : గచ్ఛతి** – గమ్లు (గమ్) గతౌ (వెళ్ళుట) సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ భ్వాది ప్రకరణము.

ఇషు గమి యమాం ఛః (సూత్రమ్ 7–3–77) అను సూత్రముచే **'మ'** కారమునకు **'ఛ'** కారాదేశము.

గమ్+అ+తి – గఛ్+అ+తి – తుగాగమము, శ్చుత్వములచే 'గచ్ఛతి' అను రూపము సిద్ధిస్తుంది.

"కర్మానుగో గచ్ఛతి జీవ ఏకః"

కర్మ ఒక్కటే జీవిని అనుసరించును

భజ గోవిందమ్ – గోవిందుని అనుసరించుము.



## 13

**'ద్వాదశమంజరికా'** స్తోత్రము పిమ్మట శ్రీశంకరభగవత్పాదులవారి శిష్యులు ఒక్కొక్కరు ఒక శ్లోకము చొప్పున 14 శ్లోకములు చెబుతూ **'భజ గోవిందమ్'** అనే ప్రకరణ గ్రంథాన్ని పూర్తిగావించినారు. వీటికే **'చర్పటమంజరికా'** స్తోత్రముగా ప్రసిద్ధి. శిష్యులు చెప్పిన ఈ 'చర్పటమంజరికా' శ్లోకములను శ్రీశంకరభగవత్పాదులవారు విని సంతుష్టాంతరంగులై వారిని దీవిస్తూ మరొక 5 శ్లోకములు చెప్పి గ్రంథోపసంహారము గావించినారు.

**అవతారిక :** 'సత్పురుషుల సాంగత్యముతో జీవన్ముక్తికి మార్గనిర్దేశమవుతుందని' శ్రీశంకర భగవత్పాదులవారి శిష్యులు **శ్రీపద్మపాదుల**వారిచే ఆశువుగా చెప్పబడిన శ్లోకమిది.

శ్లో॥ **కా తే కాన్తా ధనగతచిన్తా**
**వాతుల! కిం తవ నాస్తి నియన్తా ।**
**త్రిజగతి సజ్జనసంగతిరేకా**
**భవతి భవార్ణవతరణే నౌకా ॥** **13**

**పదవిభాగము :** కా, తే, కాన్తా, ధనగత-చిన్తా, వాతుల! కిమ్, తవ, నాస్తి, నియన్తా, త్రిజగతి, సజ్జనసంగతిః, ఏకా, భవతి, భవార్ణవతరణే, నౌకా ॥

**అన్వయక్రమము :** హే వాతుల!, తే కాన్తా కా? ధనగత-చిన్తా (చ) కా? తవ నియన్తా నాస్తి కిమ్? త్రిజగతి సజ్జనసంగతిః భవార్ణవతరణే ఏకా నౌకా భవతి ।

**ప్రతిపదార్థము :** హే వాతుల! = ఓ మూర్ఖుడా, అజ్ఞానముతో కప్పివేయబడినవాడా!
తే కాన్తా కా? = ఎవరు నీ భార్య?
ధనగత-చిన్తా కా? = ఎట్టిది ధనసంబంధమైన చింత?
తవ నియన్తా నాస్తి కిమ్ = నిన్ను శాసించేవాడు లేడా యేమి?
త్రిజగతి = ముల్లోకాల్లో,
సజ్జనసంగతిః = సజ్జనసాంగత్యము,
ఏకా = ఒక్కటే,
భవార్ణవతరణే = సంసారసాగరమును దాటించే,
నౌకా = పడవ,
భవతి = అవుతుంది

**తాత్పర్యము :** ఓ మూర్ఖుడా! ఎవరు నీ భార్య? ఎట్టిది ధనసంబంధమైన చింత? నిన్ను శాసించేవాడు లేడా యేమి? ముల్లోకాల్లో సజ్జనసాంగత్యము ఒక్కటే సంసారసాగరమును దాటించే పడవ అవుతుంది.

**పాఠాంతరాలు :** 1. త్రిజగతి - క్షణమపి

**సమాసాలు :** 1. ధనగతచిన్తా - ధనే గతచిన్తా ధనగతచిన్తా ।

2. త్రిజగతి - త్రిషు జగతి ।

3. సజ్జనసంగతిః - సన్ జనః సజ్జనః, సజ్జనానాం సంగతిః సజ్జనసంగతిః ।

4. భవార్ణవతరణే - భవ ఏవ అర్ణవః భవార్ణవః, తస్య తరణే భవార్ణవతరణే ।

**క్రియలు :** 1. భవతి - భూ ధాతోః (భూ సత్తాయాం) లట్, పరస్మైపదే ప్రథమపురుషః ఏకవచనమ్, భ్వాదిః, పరస్మైపదమ్, అకర్మకః ।

| | | |
|---|---|---|
| **భవతి** | భవతః | భవన్తి |
| భవసి | భవథః | భవథ |
| భవామి | భవావః | భవామః |

అ) భూ–ప్రాప్తౌ; భావయతి / భవతి – భావయతే; చురాదిః లట్, ఉభయపదమ్, సకర్మకః ।

| | | |
|---|---|---|
| భావయతి / **భవతి** | భావయతః / భవతః | భావయన్తి / భవన్తి |
| భావయసి / భవసి | భావయథః / భవథః | భావయథ / భవథ |
| భావయామి / భవామి | భావయావః / భవావః | భావయామః / భవామః |

ఆ) భూ–ప్రాప్తౌ; చురాదిః, ఆత్మనేపదమ్, సకర్మకః । లట్ ।

| | | |
|---|---|---|
| భావయతే / భవతే | భావయేతే / భవేతే | భావయన్తే / భవన్తే |
| భావయసే / భవసే | భావయేథే / భవేథే | భావయధ్వే / భవధ్వే |
| భావయే / భవే | భావయావహే / భవావహే | భావయామహే/భవామహే |

వేదమంత్రము

"శతమానం **భవతి** శతాయుః
పురుషశ్శతేంద్రియ ఆయుష్యేవేంద్రియే ప్రతితిష్ఠతి" ॥

అందరికి సుపరిచితమైన వేదమంత్రము. ఋషులు మనకందించిన వేదాలలో నుండి గ్రహించబడినది. వివాహమైన లేదా ఏ హిందూ సంప్రదాయ శుభకార్యమైన ఆశీర్వచనంతో ముగించటం ఆనవాయితీగా వస్తుంది.

నూతనదంపతులను నిండునూరేళ్లు సంపూర్ణ ఆరోగ్యంతో ఆనందంగా జీవించమని క్లుప్తంగా దీని అర్థము.

**పదాదర్శము : వాతుల!, సజ్జనసంగతిః**

అ) సజ్జనసాంగత్యము పొందాలంటే, అంతకు ముందుగా మూర్ఖత్వాన్ని వదిలిపెట్టాలి. అప్పుడే సజ్జనులు ఎవరన్న విషయం బోధపడుతుంది. వారిని కలుసుకోవాలని మనసులో బలంగా కోరుకోవాలి. కోరుకున్నంత మాత్రాన సజ్జనులు మనదగ్గరికి రారు.

వారున్నచోటుకు మనమే చేరుకోవాలి. వాళ్ళు చేస్తున్నది సర్వసామాన్యంగా, నిత్యానిత్య చర్చ అయి ఉంటుంది. అంతేకాక, లౌకికవిషయాల గుఱించి మాట్లాడుకోరు. ఆ సమావేశంలో జరిగే చర్చను ఓపికగా వినాలి, ఆ సంభాషణలో అనుభవం కొంచెం తక్కువుగా ఉన్నవాళ్ళుగానీ, ఆరంభంలో ఉన్నవాళ్ళుగానీ ఏవో ప్రశ్నలు వేస్తుంటారు. అనుభవం ఉన్నవాళ్ళు ఇంకేవో సమాధానలు చెబుతుంటారు. వారి చర్చలలో ఏయే సందేహాలు వ్యక్తమవుతున్నాయి, ఏయే పరిష్కారాలు వెలువడుతున్నాయో జాగ్రత్తగా గమనించాలి. ఈ క్రమములో తాను ఏస్థాయిలో ఉన్నానన్న సంగతి సాధకుడికి బోధపడుతుంది.

ధరణి సజ్జనసంగంబు దలప నుభయ
సమ్మతంబగు వారలు సలుపునట్టి
సరస సంభాషణ ప్రశ్న సరణి నిఖిల
జనములకు సుఖకరమగు జనవరేణ్య!. – భాగవతము – 4స్కంధం.

'ఉభయసమ్మతంగా జరిగే సజ్జనుల సంభాషణ, వారి చర్చలు, సంధించే ప్రశ్నలు, వాటికి వెలువడే సమాధానాలు అందరికీ మేలుచేస్తాయి'. అని పై పద్యభావం.

సజ్జనుల సాంగత్యాన్ని కాలక్షేపముగా భావిస్తే ఏప్రయోజనమూ ఉండదు. వారి చర్చల్లోని ఆంతర్యాన్ని అర్థం చేసుకోవాలి. అందులోని సారాంశాన్ని సంగ్రహించాలి. ఆ అనుభవముతో మన వ్యక్తిత్వాన్ని మార్చుకోగలగాలి. జీవితాన్ని తీర్చిదిద్దుకోవాలి.

శ్రీశంకరభగవత్పాదులవారి ఈ 'భజగోవింద' సూత్రములో జీవన్ముక్తికి తొలి అడుగు సజ్జనసాంగత్యమే. – డా. వెలుదండ సత్యనారాయణ

ఆ) **శ్రీసదాశివబ్రహ్మేంద్రులవారి ఈ కీర్తనను** స్మరించుకుందాం.

చిన్తా న హి రే – నాస్తి కిల (16) కామ్బోదిరాగః ఆదితాళమ్

చిన్తా నాస్తి కిల
తేషాం – చిన్తా నాస్తి కిల.

1. శమదమకరుణాసమ్పూర్ణానామ్ ।
**సాధుసమాగమసంకీర్ణానామ్** ॥ చిన్తా।

2. కాలత్రయజితకన్దర్పాణామ్ ।
ఖణ్డితసర్వేంద్రియదర్పాణామ్ ॥ చిన్తా।
3. పరమహంసగురుపదచిన్తానామ్ ।
బ్రహ్మానన్దామృతమత్తానామ్ ॥ చిన్తా।

చింతలేదు - వారికి శోకము లేదు.

1. అంతరింద్రియములను బహిరింద్రియములను బూర్తిగా అదుపులో ఉంచుకొన్నవారికి, **సజ్జనసంగతియందు** కాలము గడుపువారికి, దుఃఖము లేదు, చింతలేదు.

2. మూడువేళలయందు కామునెన్నడును కదలనీయనివారికి, అన్ని యింద్రియముల విజృంభణమును పూర్తిగా అరికట్టినవారికి, చింత ఏమున్నది! శోకమేమున్నది ।

3. పరమహంసలైన శ్రీగురువుల పాదములయందు దమ్ముదామర్పించుకొన్నవారికి, బ్రహ్మానందామృతపానముచే తమ్ముదామరచువారికి చింత ఏమున్నది? శోకమేమున్నది?

శ్రీ సదాశివబ్రహ్మేంద్రులకు నమస్సులు.

భజ గోవిందమ్ - గోవిందుని స్మరింపుము.



## 14

**అవతారిక :** 'విధివిహితమైన దారిని ఎంచుకొని, అనుసరించి జీవన్ముక్తిని బడయాలి' అని శ్రీశంకరభగవత్పాదులవారి శిష్యులు **శ్రీతోటకాచార్యుల వారిచే** ఆశువుగా చెప్పబడిన శ్లోకమిది.

**శ్లో॥ జటిలో ముణ్డీ లుఞ్చితకేశః**
**కాషాయామ్బరబహుకృతవేషః ।**
**పశ్యన్నపి చ న పశ్యతి మూఢో**
**హ్యుదరనిమిత్తం బహుకృతవేషః ॥ 14**

**పదవిభాగము :** జటిలః, ముణ్డీ, లుఞ్చితకేశః, కాషాయ+అంబర-బహుకృత-వేషః, పశ్యన్, అపి, చ, న, పశ్యతి, మూఢః, హి, ఉదర-నిమిత్తమ్, బహుకృత-వేషః ।

**అన్వయక్రమము :** జటిలః (వా) ముణ్డీ (వా) లుఞ్ఛితకేశః (వా) కాషాయాంబర-బహుకృతవేషః (వా) పశ్యన్నపి చ న పశ్యతి మూఢః । ఉదరనిమిత్తం హి (ఏషః) బహుకృతవేషః ।

**ప్రతిపదార్థము :** (హే వాతుల! = ఓ మూర్ఖుడా!)

జటిలః = తలన వెంట్రుకలు అట్టలుకట్టి ఉంచుకున్నవాడొకడు,
ముణ్డీ = నున్నగా గుండు గీయించుకున్న వాడొకడు,
లుంచితకేశః = పీకివేయబడ్డ వెంట్రుకలున్న వాడొకడు,
కాషాయాంబరబహుకృతవేషః = కాషాయవస్త్రములతో అనేకవిధములైన వేషములు వేసేవాడొకడు,
పశ్యన్నపి చ = చూస్తుండీ
న పశ్యతి = చూడడు (వాస్తవాన్ని గ్రహించనివాడు)
మూఢః = మూఢుడు.
ఉదరనిమిత్తమ్ హి = పొట్టగడుపుకోవటానికి మాత్రమే
(ఏషః) బహుకృతవేషః = ఇన్ని వేషములు వేసెడివాడు వీడు...
భజ గోవిందమ్

**తాత్పర్యము :** తలన వెంట్రుకలు అట్టలుకట్టి ఉంచుకున్నవాడొకడు, నున్నగా గుండు గీయించుకున్నవాడొకడు, పీకివేయబడ్డ వెంట్రుకలున్న వాడొకడు, కాషాయవస్త్రములతో అనేకవిధములైన వేషములు వేసేవాడొకడు, చూస్తుండీ చూడడు మూఢుడు. పొట్టగడుపుకోవటానికే ఇన్ని వేషములు వేసేది వీడు.

**సమాసాలు :** 1. జటిలః – జటా అస్యాస్తీతి జటిలః ।

2. ముణ్డీ – ముణ్డమ్ అస్యాస్తీతి ముణ్డీ ।

3. లుంచితకేశః – లుంచితః కేశః యేన సః లుంచితకేశః । బహువ్రీహిః ।

4. కాషాయాంబరబహుకృతవేషః – కాషాయేణ రక్తం కాషాయామ్, కాషాయేణ అంబరేణ బహుకృతః వేషః, యేన సః కాషాయాంబరబహుకృతవేషః । బహువ్రీహిః ।

5. బహుకృతవేషః – బహుభిః (ఉపాయైః) కృతః వేషః యేన సః బహుకృతవేషః ।

**క్రియలు :** 1. పశ్యతి – 'పశ్యతి – ధృశ్' ధాతోః (దృశిర్-ప్రేక్షణే) లట్ పరస్మైపదే ప్రథమపురుషః ఏకవచనమ్, భ్వాదిః, పరస్మైపదమ్, సకర్మకః ।

| | | |
|---|---|---|
| **పశ్యతి** | పశ్యతః | పశ్యన్తి |
| పశ్యసి | పశ్యథః | పశ్యథ |
| పశ్యామి | పశ్యావః | పశ్యామః |

శ్లో॥ యో మాం **పశ్యతి** సర్వత్ర
సర్వం చ మయి **పశ్యతి** ।
తస్యాహం న ప్రణశ్యామి
స చ యే న ప్రణశ్యతి ॥ భగవద్గీత 6-30

(అన్ని ప్రాణులలో తననూ, తనలోనే అన్ని ప్రాణులనూ చూసేవానిమీద నా దృష్టి, నామీదే వాని దృష్టీ వుంటాయి.)

**పదాదర్శము : మూఢః** – మహర్షి వాల్మీకి, మహాకవి భారవి – మూర్ఖుడుని ఎలా నిర్వచించారో చూడండి.

అ) శ్లో॥ యుక్త్యా ప్రబోధ్యతే మూఢః
ప్రాజ్ఞస్తత్త్వేన బోధ్యతే ।
**మూఢః** ప్రాజ్ఞత్వమాయాతి
న యుక్త్యా బోధనం వినా ॥ – యోగవాశిష్ఠమ్ 6-49-21

మూర్ఖుడిని తర్కంద్వారా దారికి తెస్తారు. జ్ఞాని విషయస్వభావంనుండి సత్యాన్ని తెలుసుకుంటాడు. కానీ తెలివితక్కువవాడు హేతువాదం లేకుండా వివేకాన్ని ఎన్నటికీ పొందడు.

ఆ) శ్లో॥ యః కరోతి వధోదర్కా నిఃశ్రేయసకరీః క్రియాః ।
గ్లానిదోషచ్ఛిదః స్వచ్ఛాః స **మూఢః** పంకయత్యపః ॥
– కిరాతార్జునీయమ్ 11-19

ఎవడు మోక్షానికుపయోగపడే క్రియలను హింసకుపయోగిస్తాడో వాడు మూర్ఖుడు. అలసటను తొలగించే తేటనీటిని బురదగా మార్చేవాడు.



## 15

**అవతారిక :** 'రోజూ రేపూ అంటూ వాయిదా వేయకుండా తత్క్షణమే 'ఆధ్యాత్మికసాధనను ప్రారంభించండి' అని శ్రీశంకరభగవత్పాదులవారి శిష్యులు **శ్రీహస్తామలకులవారిచే** ఆశువుగా చెప్పబడిన శ్లోకమిది.

**శ్లో॥ అఙ్గం గలితం ఫలితం ముణ్డం**
**దశనవిహీనం జాతం తుణ్డమ్ ।**
**వృద్ధో యాతి గృహీత్వా దణ్డం**
**తదపి న ముఞ్చత్యాశాపిణ్డమ్ ॥ 15**

**పదవిభాగము :** అఙ్గమ్, గలితమ్, ఫలితమ్, ముణ్డమ్, దశనవిహీనమ్, జాతమ్, తుణ్డమ్, వృద్ధః, యాతి, గృహీత్వా, దణ్డమ్, తత్, అపి, న, ముఞ్చతి, ఆశాపిణ్డమ్.

**అన్వయక్రమము :** అఙ్గం గలితమ్ । ముణ్డం ఫలితమ్ । దశనవిహీనం తుణ్డం జాతమ్। వృద్ధః దణ్డం గృహీత్వా యాతి । తదపి ఆశాపిణ్డమ్ న ముఞ్చతి ।

**ప్రతిపదార్థము :** (హే వాతుల! = ఓ మూర్ఖుడా!)

అఙ్గం గలితమ్ = శరీరము కృశించిపోయింది.
ముణ్డమ్ ఫలితమ్ = జుట్టు ఊడి తల గుండయిపోయింది.
దశనవిహీనం తుణ్డం జాతమ్ = పళ్ళూడి నోరు బోసిపోయింది.
వృద్ధః దణ్డం గృహీత్వా యాతి = ముసలి కఱ్ఱపట్టుకొని పోతున్నాడు.
తదపి = అయినా సరే,
ఆశాపిణ్డమ్ = యావ,
న ముఞ్చతి = వీడదు.

**తాత్పర్యము :** శరీరం కృశించిపోయింది, జుట్టు ఊడి తల గుండయిపోయింది, పళ్ళూడి నోరు బోసిదైపోయింది, ముసలి కఱ్ఱపట్టుకొని పోతున్నాడు, అయినాసరే యావ వీడదు.

**సమాసాలు :** 1. దశనవిహీనమ్ – దశ్యతే ఏభిః ఇతి దశనాని । దశనైః విహీనం దశనవిహీనమ్ ।

2. ఆశాపిణ్డమ్ – ఆశా ఏవ పిణ్డమ్, ఆశాపిణ్డమ్.

**క్రియలు :** 1. **యాతి** – యా ధాతోః (యా ప్రాపణే) లట్ పరస్మైపదే ప్రథమపురుషః ఏకవచనమ్, అదాదిః, పరస్మైపదమ్, సకర్మకః ।

| | | |
|---|---|---|
| **యాతి** | యాతః | యాన్తి |
| యాసి | యాథః | యాథ |
| యామి | యావః | యామః |

శ్లో॥ అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కలేవరమ్ ।
యః **ప్రయాతి** స మద్భావం **యాతి** నాస్త్యత్ర సంశయః ॥
– శ్రీమద్భగవద్గీత 8–5

మరణకాలమున ప్రత్యగభిన్నమయిన బ్రహ్మను **'అహంబ్రహ్మాస్మి'** అని బ్రహ్మాకారవృత్తితో అనుసంధానము చేయుచు, లేక కేవలమాత్మస్వరూపమును ధ్యానించుచు, లేక మనస్సును వృత్తిరహితమొనర్చి ఆత్మననుభవించుచుగాని యెవడు మరణించునో వాడు (మద్భావం) ఆత్మతత్త్వమగు సచ్చిదానందరూపమును పొందును. ఇందు సంశయము లేదు. – భాష్యార్కప్రకాశికనుండి.

2. ముఞ్చతి : 12వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము :** 1. **ఆశాపిణ్డమ్ – యావ, కక్కుర్తి**

అ) శ్లో॥ **ఆశాయా** దాసా యే దాసాస్తే సర్వలోకస్య ।
**ఆశా** దాసీ యేషాం తేషాం దాసాయతే లోకః ॥
– స్కాన్దపురాణమ్ – వైష్ణవఖండమ్ – 20అ.

ఆశకు దాసులైన వారు లోకమునకంతకు దాసులే. ఆశ ఎవరికి దాసి అవుతూందో వారికి లోకమంతా దాసీభూతమవుతుంది.

2. అఙ్గం గలితం... న ముఞ్చత్యాశాపిణ్డమ్ ।

దంతంబుల్పడనప్పుడే తనువునందారూఢి యున్నప్పుడే
కాంతాసంగము రోయనప్పుడే జరాక్రాంతంబు గానప్పుడే
వింతల్మేన జరింపనప్పుడే కురుల్వెల్లగానప్పుడే
చింతంపన్వలె నీ పదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా!

ఓ శ్రీకాళహస్తీశ్వరా! పళ్లూడకముందే, తలనెరవకముందే, శరీరంలో పట్టుత్వము సడలనప్పుడే, స్త్రీలు ఈసడించుకోకముందే, ముసలితనము ముదరక మునుపే వింత వింత రోగాల పాలవకమునుపే 'నీ పాదపద్మములను ఆశ్రయించాలి' అంటారు మహాకవి ధూర్జటి.

3. **ఆశా**నామనదీమనోరథజలా తృష్ణాతరంగాకులా
రాగగ్రాహవతీ వితర్కవిహగా ధైర్యద్రుమధ్వంసినీ ।
మోహావర్తసుదుస్తరాతిగహనా ప్రోతుఙ్గచిన్తాతటీ
తస్యాః పారగతా విశుద్ధమనసో నన్దతి **యోగీశ్వరాః** ॥ వై.శ. 10

... **ఆశ** యను దాటరాని నదిని విశుద్ధమనస్కులైన యోగీశ్వరులు తరించి కేవల నానందమున జెలగుచుందురు.

భజ గోవిందమ్ – గోవిందుని సేవింపుము.



## 16

**అవతారిక :** 'రాగద్వేషాలు అదుపులో ఉంచుకోవాలి' అని శ్రీశంకరభగవత్పాదులవారి శిష్యులు **శ్రీసుబోధాచార్యులవారిచే** ఆశువుగా చెప్పబడిన శ్లోకమిది.

**శ్లో॥ అగ్రే వహ్నిః పృష్ఠే భానుః**
**రాత్రౌ చుబుకసమర్పితజానుః ।**
**కరతలభిక్షస్తరుతలవాస –**
**స్తదపి న ముఞ్చత్యాశాపాశః ॥ 16**

**పదవిభాగము :** అగ్రే, వహ్నిః, పృష్ఠే, భానుః, రాత్రౌ, చుబుక–సమర్పిత–జానుః, కరతలభిక్షః, తరుతలవాసః, తదపి, న, ముఞ్చతి, ఆశాపాశః ।

**అన్వయక్రమము :** (యస్య) అగ్రే వహ్నిః (భవతి) । (యస్య) పృష్ఠే భానుః (భవతి) (యః) రాత్రౌ చుబుక–సమర్పిత–జానుః (భవతి) । (యః) కరతలభిక్షః (భవతి) (యః) తరుతలవాసః (భవతి) తత్ అపి ఆశాపాశః న ముఞ్చతి ।

**ప్రతిపదార్థము :** (హే వాతుల! = ఓ మూఢుడా!)

అగ్రే వహ్నిః = ఎదుట (చలి) మంట పెట్టుకొనేవాడు
పృష్ఠే భానుః = వీపుపై సూర్యుడి (కిరణములు) ఎండ పడేటట్లుగా ఉండేవాడు,
రాత్రౌ చిబుకసమర్పితజానుః = రాత్రులందు మునగదీసి పడుకొనేవాడు,
కరతలభిక్షః = దోసిలితో భిక్షను స్వీకరించేవాడు,
తరుతలవాసః అపి = చెట్టుక్రిందే వసించేవాడున్నూ
తదపి = అయినా సరే,
ఆశాపాశః = ఆశయనే బంధము,
న ముఞ్చతి = వీడదు.

**తాత్పర్యము :** ఎదుట (చలి) మంటపెట్టుకొనేవాడు, వీపుపై సూర్యుడి ఎండ పడేటట్లుగా ఉండేవాడు, రాత్రులందు మునగదీసి పడుకొనేవాడు, దోసిలితో భిక్ష స్వీకరించేవాడు, చెట్టుక్రింద వసించేవాడున్నూ అయినాసరే ఆశయనే బంధము వీడదు.

**పాఠాంతరాలు :** 1. చుబుక... – చిబుక...

**సమాసాలు :** 1. చుబుకసమర్పితజానుః – చుబుకే సమర్పితే జానునీ యేన సః చుబుకసమర్పితజానుః । బహువ్రీహిః ।

2. కరతలభిక్షః – కరస్య తలం కరతలం, తస్మిన్ భిక్షా యస్య సః కరతలభిక్షః । బహువ్రీహిః ।

3. తరుతలవాసః – తరోః తలం తరుతలం తస్మిన్ వాసః యస్య సః తరుతలవాసః । బహువ్రీహిః ।

4. ఆశాపాశః – ఆశా ఏవ పాశః ఆశాపాశః ।

**క్రియలు :** 1. ముఞ్చతి – 12వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము :**

శ్లో॥ వలిభిర్ముఖమాక్రాన్తం పలితైరహితం శిరః ।
గాత్రాణి శిథిలాయన్తే తృష్ణైకా తరుణాయతే ॥ – వై.శ.8.

మొగమెల్ల ముడుతలు అల్లుకున్నాయి. తలంతా నెఱసినది. శరీరం సడలినది. ఒక్క **ఆశ** మాత్రము విజృంభించుచున్నది.

భజ గోవిందమ్ – గోవిందుని సేవింపుము.



## 17

**అవతారిక :** 'ఆత్మజ్ఞానము జీవన్ముక్తికి దారి' అని శ్రీశంకరభగవత్పాదులవారి శిష్యులు శ్రీసురేశ్వరాచార్యులవారిచే ఆశువుగా చెప్పబడిన శ్లోకమిది.

**శ్లో॥ కురుతే గఙ్గాసాగరగమనం**
**వ్రతపరిపాలనమథవా దానమ్ ।**
**జ్ఞానవిహీనస్సర్వమతేన**
**భజతి న ముక్తిం జన్మశతేన ॥ 17**

**పదవిభాగము :** కురుతే, గఙ్గాసాగరగమనమ్, వ్రతపరిపాలనమ్, అథవా, దానమ్, జ్ఞానవిహీనః, సర్వమతేన, భజతి, న, ముక్తిమ్, జన్మశతేన.

**అన్వయక్రమము :** (యః) గంగాసాగరగమనం వ్రతపరిపాలనం అథవా దానం కురుతే, (సః) జ్ఞానవిహీనః (చేత్) సర్వమతేన జన్మశతేన ముక్తిం న భజతి ।

**ప్రతిపదార్థము :** (హే వాతుల! = ఓ మూఢుడా!)

గంగాసాగరగమనం కురుతే = గంగలో లేదా సాగరంలో మునిగినా,
వ్రతపరిపాలనం కురుతే = వ్రతాలు ఆచరించినా,
అథవా = ఇంకా ఏమైనా
దానం కురుతే = దానాలు చేసినా,
జ్ఞానవిహీనః (చేత్) = జ్ఞానవిహీనుడయితే,
సర్వమతేన = అన్నీ తెలిసినా,
జన్మశతేన = పెక్కుజన్మలెత్తినా,
ముక్తిమ్ = 'జీవన్ముక్తి'ని
న భజతి = పొందలేదు. ... భజ గోవిందమ్.

**తాత్పర్యము :** గంగలో లేదా సాగరంలో మునిగినా, వ్రతాలు ఆచరించినా, ఇంకా దానాలు చేసినా జ్ఞానహీనుడయితే అన్నీ తెలిసినా, పెక్కుజన్మలెత్తినా 'జీవన్ముక్తి'ని పొందలేడు.

**సమాసాలు :** 1. గంగాసాగరగమనమ్ – గంగా చ సాగరశ్చ గంగాసాగరౌ, తయోః గమనం గంగాసాగరగమనమ్ । తత్ (ద్వితీయా) గంగాసాగరగమనమ్ ।

2. వ్రతపరిపాలనమ్ – వ్రతస్య పరిపాలనమ్, వ్రతపరిపాలనమ్ । తత్ (ద్వితీయా) వ్రతపరిపాలనమ్ । తత్పురుషః ।

3. జ్ఞానవిహీనః – జ్ఞానేన విహీనః జ్ఞానవిహీనః ।

**క్రియలు :** 1. **కురుతే** – కృ ధాతోః (డుకృఞ్కరణే) లట్, ఆత్మనేపదే ప్రథమపురుషః, ఏకవచనమ్, తనాదిః, ఉభయపదమ్, సకర్మకః ।

| | | |
|---|---|---|
| **కురుతే** | కుర్వాతే | కుర్వతే |
| కురుషే | కుర్వాథే | కురుధ్వే |
| కుర్వే | కుర్వహే | కుర్మహే |

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసా**త్కురుతే**ఽర్జున! ।
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసా**త్కురుతే** తథా ॥ భగవద్గీత 4–37

(ఓయి అర్జునా! మండుచున్న అగ్ని – కట్టెలనెట్లు భస్మము చేయునో, అట్లే జ్ఞానమను అగ్ని సర్వకర్మలను భస్మముచేయును, అనగా బీజశక్తి లేనివాటినిగా చేయును.

2. **భజతి** – 'భజ్' ధాతోః (భజ సేవాయామ్) లట్, పరస్మైపదే, ప్రథమపురుషః, ఏకవచనమ్, భ్వాదిః ఉభయపదమ్, సకర్మకః ।

| | | |
|---|---|---|
| **భజతి** | భజతః | భజన్తి |
| భజసి | భజథః | భజథ |
| భజామి | భజావః | భజామః |

శ్లో॥ ...ఛిత్త్వా కర్పూరఖణ్డాన్ వృతిమిహ **కురుతే** కోద్రవాణాం సమన్తాత్
ప్రాప్యే మాం కర్మభూమిం న **భజతి** మనుజోయస్తపో మన్దభాగ్యః ॥
– భర్తృహరి నీతిశతకము 96

(... కర్మభూమిలో పుట్టి కర్మను ఆచరించని మనుజుడు మహామూఢుడన బడతాడు)

**పదాదర్శము :** శ్రీశంకరభగవత్పాదులవారు 'వివేకచూడామణి' గ్రంథములో ఇలా చెబుతారు.

శ్లో॥ పఠన్తు శాస్త్రాణి యజన్తు దేవాన్
కుర్వన్తు కర్మాణి భజన్తు దేవతాః ।
ఆత్మైకబోధేన వినా విముక్తి -
ర్న సిద్ధ్యతి బ్రహ్మశతాంతరేపి ॥ 5

శాస్త్రాలు చదివినా, దేవతల ప్రీత్యర్థం యజ్ఞాలు చేసినా, దేవతలను భజించినా, మనిషి తాను ఆత్మ అన్న విషయము తెలుసుకోకపోతే కోటికోటి సంవత్సరాలైనా ముక్తిని పొందలేడు.

శ్లో॥ అర్థస్య నిశ్చయో దృష్టో విచారేతి హితోక్తితః ।
న స్నానేన న దానేన ప్రాణాయామశతేన వా ॥ 13

పుణ్యనదీస్నానాలు, దానాలు, ప్రాణాయామాదులు ఎన్ని చేసినా, సత్యం తెలుసుకోవడానికి ఏమాత్రమూ దోహదపడవు, కేవలం గురూక్తులపైన దృష్టిని ఉంచి అర్థం చేసుకోవడం వల్లనే **'ఆత్మజ్ఞానం'** కలుగుతుందని ఈ శ్లోకభావం.

భజ గోవిందమ్ - గోవిందుని సేవింపుము.



## 18

**అవతారిక :** 'జ్ఞాని ఆనందడోలికల్లో మునుగుతాడిచటనే' అని శ్రీశంకరభగవత్పాదులవారి శిష్యుడు **శ్రీనిత్యానందులవారిచే** ఆశువుగా చెప్పబడిన శ్లోకమిది.

**శ్లో॥ సురమన్దిరతరుమూలనివాసః**
**శయ్యాభూతలమజినం వాసః ।**
**సర్వపరిగ్రహభోగత్యాగః**
**కస్య సుఖం న కరోతి విరాగః ॥ 18**

**పదవిభాగము :** సురమన్దిర–తరుమూల–నివాసః, శయ్యా, భూతలమ్, అజినమ్, వాసః, సర్వపరిగ్రహ–భోగత్యాగః, కస్య, సుఖమ్, న, కరోతి, విరాగః ।

**అన్వయక్రమము :** (యః) సురమన్దిరతరుమూలనివాసః, (యస్య) శయ్యా భూతలం, (యస్య) వాసః అజినం (యః) సర్వపరిగ్రహభోగత్యాగః (తస్య సుఖం భవతి) (సః) విరాగః, కస్య సుఖం న కరోతి ।

**ప్రతిపదార్థము :** (హే వాతుల! = ఓ మూఢుడా!)

(యః) సురమన్దిర–తరుమూల–నివాసః = దేవాలయం గాని / చెట్టుక్రింద గాని వసించేవాడెవడో

శయ్యా భూతలమ్ = పక్క భూమో,

అజినం వాసః = చర్మం దుస్తులో,

సర్వపరిగ్రహభోగత్యాగః = సర్వభోగాలను త్యాగం చేసేవాడో,

(సః) విరాగః = అతడు విరాగి,

కస్య సుఖమ్ న కరోతి = అటువంటి విరాగికి ఆనందము ఎందుకుండదు? ... భజ గోవిందమ్.

**తాత్పర్యము :** ఎవడు దేవాలయంలో గాని / చెట్టుక్రింద గాని వసించేవాడు గాను, భూమి శయ్యగాను, చర్మం దుస్తులుగాను, సర్వభోగాలను తృణీకరించినవాడుగాను ఉంటాడో అతడు విరాగి. అటువంటి విరాగికి ఆనందము ఎందుకుండదు? అంటే ఆనందడోలికల్లో మునుగుతాడని నిశ్చితార్థము.

**సమాసాలు :** 1. సురమందిరతరుమూలనివాసః – సురాణాం మందిరం సురమందిరమ్। తరోః మూలం తరుమూలమ్ । సురమందిరం చ తరుమూలం చ సురమందిరతరుమూలే। సురమందిరతరుమూలయోః నివాసః సురమందిరతరుమూలనివాసః ।

2. సర్వ...త్యాగః – సర్వేషాం పరిగ్రహాణాం భోగానాం చ త్యాగః సర్వపరిగ్రహభోగత్యాగః।

3. విరాగః – విగతః రాగః విరాగః ।

**క్రియలు :** 1. **కరోతి** – కృఞ్ ధాతోః (డుకృఞ్కరణే) లట్ పరస్మైపదే ప్రథమపురుషః ఏకవచనమ్ । తనాదిః, ఉభయపదమ్, సకర్మకః ।

| | | |
|---|---|---|
| **కరోతి** | కురుతః | కుర్వన్తి |
| కరోషి | కురుథః | కురుథ |
| కరోమి | కుర్వః | కుర్మః |

శ్లో॥ మూకం **కరోతి** పంగుం లంఘయతే గిరిమ్ ।
యత్కృపా తమహం వందే పరమానందమాధవమ్ ॥
– గీతామాహాత్మ్యమ్

(ఎవ్వరి కృప మూగవానికి అద్భుతంగా మాటలిచ్చి, కుంటువానిని కొండలు ఉఱికిస్తుందో ఆ పరమానందమాధవునికి వందనము.)

**పదాదర్శము :** సురమన్దిర... విరాగః.

అ) శ్రీశంకరభగవత్పాదులవారు కౌపీనపంచకములో ఇలా చెబుతారు.

శ్లో॥ మూలం తరోః కేవలమాశ్రయన్తః
పాణిద్వయం భోక్తుమమన్త్రయన్తః ।
కన్థామివ శ్రీమపి కుత్సయన్తః
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః ॥ 2

చెట్టునీడనే ఆశ్రయముగా చేసుకొని, రెండు చేతులను భోజనపాత్రగా చేసుకొని, ఐశ్వర్యమనిన విముఖతతో ఉండే కౌపీనదారులు భాగ్యవంతులు.

ఆ) **విరాగః** – విరక్తః, సాధుః

శ్లో॥ విరక్తః పరదారేషు, నిస్పృహః పరవస్తుషు ।
దంభమాత్సర్యహీనో యః, స సాధుః కథ్యతే జనైః ॥

పరస్త్రీ, పరధన విముఖుడై, దంభమాత్సర్యములు లేనివానినే సాధుపురుషుడంటుంది లోకము.

శ్లో॥ సత్యమేవ వ్రతం యస్య, దయా దీనేషు సర్వధా ।
కామక్రోధౌ వశే యస్య, స సాధుః కథ్యతే జనైః ॥

ఎవనికి సత్యము పలుకుటే వ్రతమవుతుందో, ఎవనికి దీనులపట్ల దయచూపుటే నియమమవుతుందో, కామక్రోధములెవ్వనికి వశవర్తులై ఉంటాయో అతనినే 'సాధు'వని జనులు పిలుస్తారు.

భజ గోవిందమ్ – గోవిందుని సేవింపుము.



**19**

**అవతారిక :** ఎవని చిత్తము నిత్యమూ పరంబ్రహ్మములో రమిస్తుందో అతడి ఆనందమే ఆనందమని శ్రీశంకరభగవత్పాదులవారి శిష్యులు **శ్రీఆనందగిరులవారిచే** ఆశువుగా చెప్పబడిన శ్లోకమిది.

**శ్లో॥ యోగరతో వా భోగరతో వా**
**సఙ్గరతో వా సఙ్గవిహీనః ।**
**యస్య బ్రహ్మణి రమతే చిత్తం**
**నన్దతి నన్దతి నన్దత్యేవ ॥ 19**

**పదవిభాగము :** యోగరతః, వా, భోగరతః, వా, సఙ్గరతః, వా, సఙ్గవిహీనః, యస్య, బ్రహ్మణి, రమతే, చిత్తమ్, నన్దతి, నన్దతి, నన్దతి, ఏవ ॥

**అన్వయక్రమము :** యోగరతః వా భోగరతః వా సఙ్గరతః వా సఙ్గవిహీనః (భవేత్) । యస్య చిత్తం బ్రహ్మణి రమతే, (సః) నన్దతి నన్దతి నన్దత్యేవ ।

**ప్రతిపదార్థము :** (హే వాతుల! = ఓ మూర్ఖుడా!)

యోగరతః = యోగియైనా,
భోగరతః = భోగియైనా,
సఙ్గరతః = సంగుడైనా,
సఙ్గవిహీనః = అసంగుడైనా,
యస్య = ఎవనియొక్క,
చిత్తమ్ = చిత్తము,
బ్రహ్మణి = పరంబ్రహ్మమునందు,

రమతే = రమిస్తుందో,
(సః) నన్దతి నన్దతి నన్దతి+ఏవ = అతడు ఆనందమే, ఆనందమే,
ఆనందమే... భజ గోవిందమ్.

**తాత్పర్యము :** యోగియైనా, భోగియైనా, సంగుడైనా, అసంగుడైనా, ఎవనియొక్క చిత్తము పరంబ్రహ్మమునందు రమిస్తుందో, అతడు ఆనందమే, ఆనందమే, ఆనందమే.

**సమాసాలు :** 1. యోగరతః – యోగే రతః యోగరతః ।

2. భోగరతః – భోగే రతః భోగరతః ।

3. సఙ్గరతః – సఙ్గే రతః సఙ్గరతః ।

4. సఙ్గవిహీనః – సఙ్గేన విహీనః సఙ్గవిహీనః ।

**క్రియలు :** 1. **రమతే** – రమ్ ధాతోః (రము క్రీడాయామ్) లట్ ఆత్మనేపదే ప్రథమపురుషః, ఏకవచనమ్, భ్వాదిః, ఆత్మనేపదమ్, అకర్మకః ।

| | | |
|---|---|---|
| **రమతే** | రమేతే | రమన్తే |
| రమసే | రమేథే | రమధ్వే |
| రమే | రమావహే | రమామహే |

శ్లో॥ కేనాపి మిలద్దేహా
యూనా స్వాహా సహాయతిలకేన ।
సహకారమూలదేశే
సంవిద్రూపా కుటుమ్బినీ **రమతే** ॥ – మూకపంచశతీ–ఆర్యా–64

(అగ్నితిలకుడైన ఒకానొక యువకుడైన శివునిదేహముతో తన దేహమును చేర్చి ఆతని కుటుమ్బినియైన **కామాక్షీదేవి** మామిడిచెట్టు క్రింది భూమిపై రమించుచున్నది.)

2. **నన్దతి** – 'నన్దు' ధాతోః (టునది సమృద్ధౌ) లట్ పరస్మైపదే ప్రథమపురుషః, ఏకవచనమ్, భ్వాదిః, పరస్మైపదమ్, అకర్మకః ।

| | | |
|---|---|---|
| **నన్దతి** | నన్దతః | నన్దన్తి |
| నన్దసి | నన్దథః | నన్దథ |
| నన్దామి | నన్దావః | నన్దామః |

శ్లో॥ **నన్దతి** మమ హృది కాచన
మన్దిరమన్తీ నిరంతరం కాంచీమ్ ।
ఇందురవిమణ్డలకుచా
బిందువియన్నాదపరిణతా తరుణీ ॥ - మూకపంచశతీ-ఆర్యా52

(ఎల్లప్పుడు కాంచీపురినే నివాసముగా చేసికొన్న, సూర్యచంద్రమండలములే పాలిండ్లుగాగల బిందువుగా, ఆకాశముగా, నాదముగా పరిణమించిన ఒక తరుణి నా యెదలో నానందించుచున్నది.)

**పదాదర్శము :** 1. యోగరతో - నన్దత్యేవ.

అ) భగవద్గీత 5 - 8,9 శ్లోకములను ఇట అనుసంధానము చేసుకుందుము.

శ్లో॥ నైవ కించిత్కరోమీతి - యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర-న్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్॥8

శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణ-న్నున్నిమిషన్నిమిషన్నపి ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు-వర్తన్త ఇతి ధారయన్ ॥ 9

తత్త్వవిదుడైన మానవుడు సమాహితచిత్తుడగుచూ చూచుచును, వినుచును, తాకుచును, వాసనచూచుచును, తినుచును, వెళ్ళుచును, నిదిరించుచును, ఊపిరి పీల్చుచును, మాటలాడుచును, తీసుకొనుచును, కనులు తెఱచుచును, కనుమూత వేయుచును, ఇంద్రియములు విషయములందు ప్రవర్తింపుచున్నవి కాని 'నేనేమి చేయుట లేదని' తలచును. **తత్త్వవిదుడు ఆనందస్వరూపుడు.**

ఆ) అధ్యాత్మరామాయణము నందు విశ్వామిత్రుడున్ను ఇట్లే చెప్పినాడు.

"రామో న గచ్ఛతి న తిష్ఠతి నానుశోచత్యాకాంక్షతే
త్యజతి నో న కరోతి కించిత్, ఆనందమూర్తిరచలః
పరిణామహీనం మాయాగుణాననుగతో హి తథా విభాతి"

"శ్రీరామచంద్రునకు గమనాగమనాది క్రియలెవ్వియు లేవు, అతడు ఆనందరూపుడు, అచలుడు, నిర్వికారుడు, మాయాకార్యముల ననుసరించువానివలె కనబడును." అని భావము.

భజ గోవిందమ్ - గోవిందుని సేవింపుము.



## 20

**అవతారిక :** 'శాస్త్రగ్రంథాల 'అధ్యయనం, అధ్యాపనం, ఆచరణ' అవశ్య'మని శ్రీశంకర భగవత్పాదులవారి శిష్యులు **శ్రీఆనందగిరులవారిచే** ఆశువుగా చెప్పబడిన శ్లోకమిది.

**శ్లో॥ భగవద్గీతా కిఞ్చిదధీతా**
**గఙ్గాజలలవకణికా పీతా ।**
**సకృదపి యేన మురారిసమర్చా**
**క్రియతే తస్య యమేన న చర్చా ॥ 20**

**పదవిభాగము :** భగవద్గీతా, కిఞ్చిత్, అధీతా, గఙ్గా-జల-లవ-కణికా, పీతా, సకృత్+అపి, యేన, మురారి-సమర్చా, క్రియతే, తస్య, యమేన, న, చర్చా ।

**అన్వయక్రమము :** (యేన) భగవద్గీతా కిఞ్చిత్+అధీతా, (యేన) గఙ్గాజలలవకణికా పీతా, (యేన) సకృదపి యేన మురారిసమర్చా (క్రియతే), తస్య యమేన చర్చా న క్రియతే ।

**ప్రతిపదార్థము :** (హే వాతుల! = ఓ మూఢుడా!)

(యేన) భగవద్గీతా కిఞ్చిదధీతా = ఎవరిచేత భగవద్గీత ఇంచుక అధ్యయనం చేయబడినదో,
గఙ్గాజలలవకణికా పీతా = గంగాజలంలో ఇంచుక త్రావబడినదో
సకృదపి = ఒక్కసారైనను
యేన మురారిసమర్చా = ఎవనిచేత మురారి అర్చింపబడినాడో,
తస్య = వారికి,
యమేన = యమునితో,
చర్చా = చర్చ
న క్రియతే = ఉండదు. ...భజ గోవిందమ్.

**తాత్పర్యము :** (ఎవరిచేత) భగవద్గీత ఇంచుక అధ్యయనం చేయబడినదో, గంగాజలంలో ఇంచుక త్రావబడినదో, ఒక్కసారైనను మురారి అర్చింపబడినాడో, వారికి యమునితో చర్చ ఉండదు.

**సమాసాలు :** 1. గంగాజలలవకణికా – గంగాయాః జలం గంగాజలమ్ । గంగాజలస్య లవః గంగాజలలవః । తస్య కణికా, గంగాజలలవకణికా ।

2. మురారిసమర్చా – మురస్య అరిః మురారిః । మురారేః సమర్చా మురారిసమర్చా ।

**క్రియలు :** (1. పీతా – పా ధాతోః (పా–పానే) క్తాన్తం స్త్రీ.ప్ర.ఏ.)

2. **క్రియతే** – కృఞ్ ధాతోః (డుకృఞ్కరణే) కర్మణి, లట్, ఆత్మనేపదే ప్రథమపురుషః, ఏకవచనమ్ । తనాదిః, ఉభయపదమ్, సకర్మకః ।

| | | |
|---|---|---|
| **క్రియతే** | క్రియేతే | క్రియన్తే |
| క్రియసే | క్రియేథే | క్రియధ్వే |
| క్రియే | క్రియావహే | క్రియామహే |

శ్లో॥ **క్రియతే** నియమో యస్తు దానం విప్రాయ దీయతే ।
ప్రతిగృహ్ణన్తి తం దేవా మనుష్యాః పితరస్తథా ॥ 29–15 ॥

శ్లో॥ కథం చ **క్రియతే** భక్తిః కథం దేవః ప్రసీదతి ।
ఏతత్సర్వం సురశ్రేష్ఠ! శ్రోతుమిచ్ఛామహే వయమ్ ॥ 29–6 ॥
– బ్రహ్మపురాణమ్.

**పదాదర్శము :** భగవద్గీత – మోక్షశాస్త్రం. ముముక్షువులు తప్పనిసరిగా చదువవలసిన గ్రంథము. సాధకులకు దిశానిర్దేశము చేస్తుంది.

'భగవద్గీత'కు పరమప్రామాణిక వ్యాఖ్యానము నందించినవారు శ్రీ బెల్లంకొండ రామరాయకవీంద్రులు. ఈ మోక్షసాధన శాస్త్రగ్రంథమునకు వారు 'భాష్యార్కప్రకాశికా' నామముతో అత్యద్భుతమైన వ్యాఖ్యను అందించినారు. దీనికి 1956లో బ్రహ్మశ్రీ మల్లావఝ్ఝల వేంకటసుబ్బరామశాస్త్రిగారు ఆంధ్రానువాదమందించగా, దానిని బ్రహ్మశ్రీ కవితా సుబ్రహ్మణ్యంగారు అచ్చొత్తించి పలు గ్రంథాలయములందు ఆంధ్రదేశమంతటా ఉంచి అఖండమైన మేలొనరించిరి.

ఇటీవల కాలములో 02-12-2014న- గీతాజయన్తి సందర్భంగా యథాతథంగా పునర్ముద్రణ గావింపబడినది – రామోరా.

గీతామాహాత్మ్యప్రాముఖ్యతను ఇట అనుసంధానము చేసుకుందుము.

శ్లో॥ గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపి వా ।
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహమోదతే ॥ 18

గీతార్థశ్రవణానురక్తుడైనవాడు మహాపాపియైనా వైకుంఠాన్ని పొంది విష్ణువుతో కూడి ఆనందిస్తాడు.

శ్లో॥ గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః ।
**జీవన్ముక్తః** స విజ్ఞేయో దేహాంతే పరమం పదమ్ ॥ 19 ॥

నిత్యనైమిత్తికకర్మలు చేసి చిత్తశుద్ధి, చిత్త ఏకాగ్రత, చిత్త వైశాల్యము పొందిన పిదప 'గీతార్థం' ధ్యానించే వాడిని జీవన్ముక్తుడని గ్రహించు. చివరన కైవల్యప్రాప్తి కలుగుతుంది.

భజ గోవిందమ్ – గోవిందుని సేవింపుము.



## 21

**అవతారిక :** 'జన్మరాహిత్యమునకు ఆత్మజ్ఞానము అవశ్య'మని శ్రీశంకరభగవత్పాదులవారి శిష్యులు **శ్రీనిత్యనాథులవారిచే** ఆశువుగా చెప్పబడిన శ్లోకమిది.

**శ్లో॥ పునరపి జననం పునరపి మరణం**
**పునరపి జననీజఠరే శయనమ్ ।**
**ఇహ సంసారే బహుదుస్తారే**
**కృపయాఽపారే పాహి మురారే! ॥ 21**

**పదవిభాగము :** పునః, అపి, జననమ్, పునః, అపి, మరణమ్, పునః, అపి, జననీ–జఠరే, శయనమ్, ఇహ, సంసారే, బహుదుస్తారే, కృపయా, అపారే, పాహి, మురారే!

**అన్వయక్రమము :** హే మురారే! పునః+అపి జననమ్ । పునరపి మరణమ్ । పునరపి జననీ–జఠరే శయనమ్ । ఇహ సంసారే బహుదుస్తారే । అపారే కృపయా (మాం) పాహి।

**ప్రతిపదార్థము :** హే మురారే! = ఓ మురారి!

పునరపి జననమ్ పునరపి మరణమ్ = మళ్లీ మళ్లీ చావుపుట్టుకల్లో తిరగడం,

పునరపి జననీ–జఠరే శయనమ్ = మళ్లీ మళ్లీ తల్లిగర్భములో పడటం,

ఇహ సంసారే = ఇచట సంసారము,

బహుదుస్తారే = మిక్కిలి దుర్భరము,

అపారే కృపయా = అపారమైన కృపతో

(మాం) పాహి = (మమ్ము) రక్షించుము. ... భజ గోవిందమ్.

**తాత్పర్యము :** ఓ మురారి! మళ్లీ మళ్లీ చావుపుట్టుకల్లో తిరగడం, మళ్లీ మళ్లీ తల్లిగర్భములో పడటం, సంసారము మిక్కిలి దుర్భరమైనది. అపారమైన కృపతో ముమ్ము రక్షింపుము.

**సమాసాలు :** 1. దుస్తారే – దుఃఖేన తరితుం శక్యః దుస్తారః । తస్మిన్ దుస్తారే ।

2. మురారే! – మురస్య అరిః మురారిః । తస్య సంబుద్ధిః మురారే! ।

**క్రియలు :** 1. పాహి – పా ధాతోః (పా రక్షణే) లోట్ పరస్మైపదే మధ్యమపురుషః ఏకవచనమ్, అదాదిః, పరస్మైపదమ్, సకర్మకః । (పాతి).

| | | |
|---|---|---|
| పాతు / పాతాత్ | పాతామ్ | పాన్తు |
| **పాహి** / పాతాత్ | పాతమ్ | పాత |
| పాని | పావ | పామ |

అవ పురస్తాత్ । అవ దక్షిణాత్తాత్ । అవ పశ్చాత్తాత్ । అవోత్తరాత్తాత్ । అవ చోర్ధ్వాత్తాత్ । అవాధరాత్తాత్ । సర్వతో మాం **పాహి పాహి** సమన్తాత్ ॥ 4 ॥

– శ్రీ గణపతి అథర్వశీర్ష

అ) పా – పానే (త్రాగుట), భ్వాదిః, పరస్మైపదమ్, సకర్మకః । (పిబతి)

**పదాదర్శము :** మురారే!

అ) **మురారే!** – మురస్య అరిః మురారిః । తస్య సంబుద్ధిః మురారే!

శ్రీకులశేఖరాళ్వార్లకృత 'ముకుందమాలా' స్తోత్రమును ఇట అనుసంధానము చేసికొందుము.

శ్లో॥ శ్రీనాథ! నారాయణ! వాసుదేవ!
శ్రీకృష్ణ! భక్తప్రియ! చక్రపాణే! ।
శ్రీ పద్మనాభాచ్యుత! కైటభారే!
శ్రీరామ! పద్మాక్ష! హరే! **మురారే!** ॥ 36 ॥

శ్లో॥ అనన్త! వైకుంఠ! ముకున్ద! కృష్ణ!
**గోవింద!** దామోదర! మాధవేతి ।
వక్తుం సమర్థోఽపి న వక్తి కశ్చి-
దహో! జనానాం వ్యసనాభిముఖ్యమ్ ॥ 37 ॥

మురారే! అంటూ ఆ భగవంతుణ్ణి నోరార కీర్తించిన ఆ కులశేఖరాళ్వార్లకు నమస్సులు.

2. **పునరపి జననం పునరపి మరణం...**

అచ్చపుఁ జీకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్వితచర్వణులైన వారికిం
జెచ్చెరఁ బుట్టునే పరులు చెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిన నైన గానలకునేగిననైన హరిప్రబోధముల్.

– పోతనభాగవతం–ప్రహ్లాదచరితము 7–181

“...అజ్ఞానమనేది అసలైన కారుచీకటి, దాని మాయకు చిక్కి సంసారులు అనేకులు, కోరికల వలలోపడి సంసారం సాగిస్తూ ఉంటారు, చస్తూ పుడుతూ మరల చస్తూ పుడుతూ ఇలా సంసారచక్రములో తిరుగుతూనే ఉంటారు. అలాంటి వారికి విష్ణుభక్తి సులువుగా పుట్టదు. ఇంకొకళ్ళు బోధించినా కలుగదు. ఏమి ఆశ చూపించినా, ఎంతటి దానాలుచేసినా అంటదు, ఆఖరికి అడవులలోకి పోయినా ఫలితముండదు. అంత తొందరగా శ్రీహరి మీదకు మనసు పోతుందా? హరిభక్తి లభించాలి అంటే ఎన్నో జన్మల పుణ్యఫలాలు ఫలించాలి.” అంటాడు ప్రహ్లాదుడు, కోపోద్రిక్తుడైన తన తండ్రి హిరణ్యకశిపునితో.

3. యక్షప్రశ్నలలో ఒక ప్రశ్న (70) – ఏది ఆశ్చర్యం?

ప్రాణులు ప్రతిరోజూ మరణిస్తూ ఉండడం చూస్తూ మనిషి తానే శాశ్వతంగా ఈ భూమిమీద ఉండిపోతాననుకోవడం.

భజ గోవిందమ్ – గోవిందుని సేవింపుము.



## 22

**అవతారిక :** 'జ్ఞానాదేవ కైవల్యమ్' అని శ్రీశంకరభగవత్పాదులవారి శిష్యులు **శ్రీనిత్యానందులవారిచే** ఆశువుగా చెప్పబడిన శ్లోకమిది.

**శ్లో॥ రథ్యాచర్పటవిరచితకన్థః**
**పుణ్యాపుణవివర్జితపన్థః ।**
**యోగీ యోగనియోజితచిత్తో**
**రమతే బాలోన్మత్తవదేవ ॥ 22**

**పదవిభాగము :** రథ్యా–చర్పట–విరచిత–కన్థః, పుణ్య+అపుణ్య–వివర్జిత–పన్థః, యోగీ, యోగ–నియోజిత–చిత్తః, రమతే, బాల–ఉన్మత్తవత్, ఏవ ।

**అన్వయక్రమము :** రథ్యా–చర్పట–విరచిత–కన్థః పుణ్యాపుణ్య–వివర్జిత–పన్థః యోగీ యోగ–నియోజిత–చిత్తః (సన్) బాల + ఉన్మత్తవత్ ఏవ రమతే ।

**ప్రతిపదార్థము :** (హే వాతుల! = ఓ మూఢుడా!)

రథ్యా–చర్పట–విరచిత–కన్థః = దారిన (కనబడిన) గుడ్డపీలికలతో కుట్టుకున్న బొంతను కలిగినవాడు,

పుణ్యాపుణ్య–వివర్జిత–పన్థః = పాపపుణ్యములు లేనట్టి దోవను కలిగినవాడు, అగు

యోగీ = యోగిపుంగవుడు,

యోగ–నియోజిత–చిత్తః (సన్) = యోగమునందు లగ్నమైన మనసు కలిగినవాడు అగుచు,

బాలోన్మత్తవత్ = మత్తుడైన బాలునివలె

రమతే = ఆనందిస్తూ వుంటాడు.

**తాత్పర్యము :** దారిన (కనబడిన) గుడ్డపీలికలతో కుట్టుకున్న బొంత కలిగినవాడు, పాపపుణ్యములు లేనట్టి దోవను కలిగినవాడు, అగు యోగిపుంగవుడు యోగమునందు లగ్నమైన మనసు కలిగినవాడగుచు మత్తుడైన బాలునివలె ఆనందిస్తూ ఉంటాడు.

**పాఠాంతరాలు :** 1. ...చర్పట – ... కర్పట, 2. ...పాన్థః – ...పన్థః.

**సమాసాలు :** 1. రథ్యాకర్పటవిరచితకన్థః – రథ్యాయాః కర్పటః । తేన విరచితా కన్థా యస్య సః రథ్యాకర్పటవిరచితకన్థః । బహువ్రీహిః ।

2. పుణ్యాపుణ్యవివర్జితపన్థః – విశేషేణ వర్జితః వివర్జితః, పుణ్యం చ అపుణ్యం చ పుణ్యాపుణ్యే । పుణ్యాపుణ్యాభ్యాం వివర్జితః స చాసౌ పన్థశ్చ పుణ్యాపుణ్యవివర్జితపన్థః । బహువ్రీహిః ।

3. యోగనియోజితచిత్తః – యోగే నియోజితం చిత్తం యేన సః యోగనియోజితచిత్తః ।

4. బాలోన్మత్తవత్ – బాలోన్మత్తాభ్యాం తుల్యం బాలోన్మత్తవత్ ।

**క్రియలు :** 1. **రమతే** – 19వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము :** 1. శ్రీమదప్పయ్యదీక్షితులు – 'ఉన్మత్తపంచాశత్' స్తోత్రము.

శ్రీమదప్పయ్య దీక్షితులవారు తమిళనాడునందలి తిరువణ్ణామలై జిల్లా, పట్టుచీరలకు పేరుగాంచిన అరణికి దగ్గరగావున్న అడయపాలెం అన్న ఊరియందు ప్రమాదీచ నామ సంవత్సరము ఆశ్వయుజ మాసము, కృష్ణపక్షము, ఉత్తరాభాద్ర నక్షత్రమున క్రీ.శ.1520లో జన్మించినారు. వీరు శంకరాద్వైతమును త్రికరణశుద్ధిగా అనుష్ఠించిన మహనీయుడు. ఆయన చిత్తము మొత్తము పరమేశ్వర పాదయుగళికి అంకితముచేసిన మహాభక్తుడు. భక్తి–జ్ఞాన–వైరాగ్య–తత్త్వ–వేదాంతాది సకలశాస్త్రములకు ఆయన ఆటపట్టు.

ఒకసారి తమలోని శివభక్తిని పరీక్షించుకొనదలచి ఒక శిష్యుని పిలిచి దత్తూరఫలరసము అంటే ఉమ్మెత్తకాయరసము (ఇది త్రాగినవానిని ఉన్మత్తుని చేస్తుంది.) ను తెమ్మని చెప్పి, శిష్యునికి ఈ విషయమును వివరించి దాని విరుగుడు కూడ చేతికిచ్చి ఆ ఫలరసము త్రాగి ఉన్మత్తుడైనాడు. ఆ రసము త్రాగినా త్రాగకున్నా అచంచలమైన తన మనసు శివపూజారతి విడువక శివునిపై '50'శ్లోకములను ఆశువుగా చెప్పినాడు. అది నేటికీ భక్తజనరసనలపై ఉపలబ్ధము. దానిని **'ఉన్మత్తపంచాశత్'** యని, **'ఆత్మార్పణస్తుతి'**

యని అంటారు. అది ముగిసిన వెంటనే విరుగుడు త్రావి తన సహజస్థితికి వచ్చి తృప్తి చెందినాడు. తానూ శివధ్యానము ఏ పరిస్థితిలోను వీడనందుకు ఎంతో సంతసించినాడు. అందులోని ఒక శ్లోకమును ఇట అనుసంధానము చేసుకొందుము.

శ్లో॥ అర్కద్రోణప్రభృతికుసుమైరర్చనం తే విధేయం
ప్రాప్యం తేన స్మరహర ఫలం మోక్షసామ్రాజ్యలక్ష్మీః ।
ఏతజ్జానన్నపి శివ శివ వ్యర్థయన్ కాలమాత్మ -
న్నాత్మ ద్రోహీ కరణవివశో భూయసాఽధః పతాని ॥ 8

“శివ! శివ! నీ అనుగ్రహమును ఏమని వర్ణించను. సులభంగా లభించే జిల్లేడు, తుమ్మిపువ్వులతో పూజలందుకొని భక్తులకు మోక్షసామ్రాజ్యలక్ష్మిని అనుగ్రహించు చున్నావు. ఈ సూక్ష్మమును మేము తెలుసుకోలేక కాలమును వ్యర్థము చేయుచున్నాము.

ఆ మహనీయుని భక్తిభావము అమోఘము-అద్భుతము-అసమానము.

భజ గోవిందమ్ - గోవిందుని సేవింపుము.

2. ఇట భగవద్గీత - ధ్యానయోగము - 6వ అధ్యాయమును పూర్తిగా అనుసంధానము చేసికొందురుగాక.



## 23

**అవతారిక :** ‘నిత్యానిత్యవివేకం ఏర్పరచుకోవా’లని శ్రీశంకరభగవత్పాతులవారి శిష్యులు శ్రీ **యోగానందులవారిచే** ఆశువుగా చెప్పబడిన శ్లోకమిది.

**శ్లో॥ కస్త్వమ్? కోఽహమ్? కుత ఆయాతః?**
**కా మే జననీ? కో మే తాతః ।**
**ఇతి పరిభావయ సర్వమసారం**
**విశ్వం త్యక్త్వా స్వప్నవిచారమ్ ॥ 23**

**పదవిభాగము :** కః, త్వమ్, కః, అహమ్, కుతః, ఆయాతః, కా, మే, జననీ, కః, మే, తాతః, ఇతి, పరిభావయ, సర్వమ్, అసారమ్, విశ్వమ్, త్యక్త్వా, స్వప్నవిచారమ్ ।

**అన్వయక్రమము :** త్వమ్ కః? అహమ్ కః? కుతః ఆయాతః? మే జననీ కా? మే తాతః కః? స్వప్నవిచారమ్ ఇదం విశ్వం త్యక్త్వా సర్వమ్ అసారమ్ ఇతి పరిభావయ ।

**ప్రతిపదార్థము :** (హే వాతుల! = ఓ మూఢుడా!)

త్వమ్ కః? = నువ్వు ఎవరు?
అహమ్ కః? = నేనెవరు?
కుతః ఆయాతః? = ఎచటినుండి వచ్చినాను?
మే జననీ కా? = నా తల్లి ఎవరు?
మే తాతః కః = నా తండ్రి ఎవరు?
స్వప్నవిచారమ్ = స్వప్నంగా,
ఇదమ్ విశ్వమ్ = ఈ జగత్తును,
త్యక్త్వా = వదిలివేసి,
సర్వమ్ అసారమ్ = ఇదంతా సారరహితము,
ఇతి = అని,
పరిభావయ = భావింపబడవలయును.

**తాత్పర్యము :** నువ్వు ఎవరు? నేనెవరు? ఎచటనుండి వచ్చినాను? నా తల్లి ఎవరు? తండ్రి ఎవరు? స్వప్నంగా ఈ జగత్తును వదిలివేసి ఇదంతా సారరహితమని భావింపబడవలయును.

**పాఠాంతరాలు :** 1. స్వప్నవిచారమ్ – స్వప్నసమానమ్

**సమాసాలు :** 1. స్వప్నవిచారమ్ – స్వప్నే విచారః స్వప్నవిచారః । తమ్ స్వప్నవిచారమ్।

**క్రియలు :** 1. **పరిభావయ** – పరి ఉపసర్గపూర్వక భూధాతోః (భూ సత్తాయామ్) **ణిజన్తాత్** లోట్ పరస్మైపదే మధ్యమపురుషః ఏకవచనమ్.

| | | |
|---|---|---|
| భావయతు / భావయతాత్ | భావయతామ్ | భావయన్తు |
| **భావయ** / భావయతాత్ | భావయతమ్ | భావయత |
| భావయాని | భావయావ | భావయామ |

శ్లో॥ దారాపత్యం క్షేత్రం విత్తం దేహం గేహం సర్వమనిత్యమ్ ।
**ఇతి పరిభావయ సర్వమసారం** గర్భవికృత్యా **స్వప్నవిచారమ్** ॥ 2
– శ్రీ చింతామణి విరచిత గౌరీశాష్టకమ్

**పదాదర్శము :** భక్తరామదాసు ప్రణీతమైన 'దాశరథీ'శతకము నందలి (91) ఈ పద్యమును ఇట అనుసంధానము చేసుకొనదగును.

ఉ॥ ఎక్కడ తల్లిదండ్రి, సుతులెక్కడివారు, కళత్రబాంధవం
బెక్కడ జీవుడెట్టితనువెత్తినఁ బుట్టుచుఁ బోవుచున్నావాఁ
డొక్కడె, పాపపుణ్యఫలమొందిన నొక్కడె కానరాఁడు వే-
రొక్కఁడు వెంటనంటి, భవమొల్లనయా, కృపజూడవయ్య నీ
తక్కరి మాయలందిడక **దాశరథీ కరుణాపయోనిధీ** ॥

'...ఇట్టి సాంసారిక జీవనము నాకు వలదు, నాతో ఆడుకోకు, సంసార సాగరము నుండి తప్పించి కాపాడుమయ్యా' అని కవి ఆర్తితో ప్రార్థిస్తున్నాడు.

'పరమాత్ముడే జీవికి పరమాధారమని తెలుసుకోవడమే పరతత్త్వము. ఇది తెలుసుకొన్నవానికి సంసారము (చావుపుట్టుకలజంజాటము) లేదు.

భజ గోవిందమ్ - గోవిందుని సేవింపుము.



## 24

**అవతారిక :** ఈ శ్లోకమున చెప్పబడినది - 'సమదర్శనము'.

**శ్లో॥ త్వయి మయి చాన్యత్రైకో విష్ణు -**
**ర్వ్యర్థం కుప్యసి సర్వసహిష్ణుః ।**
**సర్వస్మిన్నపి పశ్యాత్మానం**
**సర్వత్రోత్సృజ భేదాజ్ఞానమ్ ॥ 24**

**పదవిభాగము :** త్వయి, మయి, చ, అన్యత్ర, ఏకః, విష్ణుః, వ్యర్థమ్, కుప్యసి, సర్వసహిష్ణుః, సర్వస్మిన్, అపి, పశ్య, ఆత్మానమ్, సర్వత్ర, ఉత్సృజ, భేదాజ్ఞానమ్ ।

**అన్వయక్రమము :** త్వయి మయి అన్యత్ర చ ఏకః విష్ణుః (అస్తి) (త్వం) వ్యర్థం కుప్యసి, సర్వసహిష్ణుః (భవ)। (త్వమ్) ఆత్మానం సర్వస్మిన్నపి పశ్య భేదాజ్ఞానం సర్వత్ర ఉత్సృజ।

**ప్రతిపదార్థము :** (హే వాతుల! = ఓ మూఢుడా!)

త్వయి = నీలో,
మయి = నాలో,
అన్యత్ర = ఇతరులందరిలో
చ = కూడ
ఏకః = ఒకే ఒక్కడైన,
విష్ణుః (అస్తి) = శ్రీమన్నారాయణుడే (వున్నాడు).
వ్యర్థం కుప్యసి = ఊరకనే కోప్పడుతున్నావు.
సర్వసహిష్ణుః (భవ) = సంయమనుడవు (కమ్ము).
(త్వమ్) ఆత్మానమ్ = సత్యపదార్థాన్ని (నీవు)
సర్వస్మిన్నపి = అన్నింటియందు
పశ్య = దర్శించు.
భేదాజ్ఞానమ్ = భేదరూపమైన అజ్ఞానమును
సర్వత్ర = అంతటా,
ఉత్సృజ = తుడిచేయి. ... భజ గోవిందమ్.

**తాత్పర్యము : 'సమదర్శనుడవుకమ్ము'** అని నిశ్చితార్థము.

**పాఠాంతరాలు :** 1. సర్వసహిష్ణుః – మయ్యసహిష్ణుః,

2. సర్వస్మిన్నపి పశ్యాత్మానం సర్వత్రోత్సృజ భేదాజ్ఞానమ్ – భవ సమచిత్తః సర్వత్ర త్వం వాంఛస్య చిరాద్యది విష్ణుత్వమ్.

**సమాసాలు :** 1. సర్వసహిష్ణుః – సోఢుం శీలమస్యాస్తీతి సహిష్ణుః । సర్వం సహిష్ణుః సర్వసహిష్ణుః ।

2. భేదాజ్ఞానమ్ – భేదనిమిత్తం అజ్ఞానం భేదాజ్ఞానమ్ । శాకపార్థివాదిసమాసః ।

**క్రియలు :** 1. **కుప్యసి** – కుప్ ధాతోః (కుప్ క్రోధే) లట్ పరస్మైపదే మధ్యమపురుషః ఏకవచనమ్ । దివాదిః, పరస్మైపదమ్, అకర్మకః ।

| | | |
|---|---|---|
| కుప్యతి | కుప్యతః | కుప్యన్తి |
| **కుప్యసి** | కుప్యథః | కుప్యథ |
| కుప్యామి | కుప్యావః | కుప్యామః |

శ్లో॥ మిత్రకలత్రసుతాదీన్ ధ్యాయస్యనిశం న మాం క్షణం జాతు ।
యది **కుప్యసి** మయి దీనే తులయామి త్వాం కథం సహ తైః ॥6

– శ్రీమదప్పయ్యదీక్షితవిరచిత–ఆర్యాశతకమ్।

అ) కుప్ – ఛాదనే, భాషార్థే, భాసార్థే, చురాదిః. ఉభయపదమ్, సకర్మకః.

2. **పశ్య** – 'పశ్యతి–దృశ్' ధాతోః (దృశిర్–ప్రేక్షణే) లోట్ పరస్మైపదే మధ్యమపురుషః ఏకవచనమ్ । భ్వాదిః, పరస్మైపదమ్, సకర్మకః ।

| | | |
|---|---|---|
| పశ్యతు / పశ్యతాత్ | పశ్యతామ్ | పశ్యన్తు |
| **పశ్య** / పశ్యతాత్ | పశ్యతమ్ | పశ్యత |
| పశ్యాని | పశ్యావ | పశ్యామ. |

శ్లో॥ **పశ్య** ప్రహ్లాద! సంయోగాన్విప్రయోగపరాయణాన్ ।
సఞ్చయాంశ్చ వినాశాన్తాన్న క్వచిద్విదధే మనః ॥ 12 ॥

– అజగరగీతా

**పదాదర్శము : సర్వస్మిన్నపి పశ్యాత్మానమ్**

అ) శ్రీమద్భగవద్గీత – ధ్యానయోగము (6) – నందలి ఈ దిగువ శ్లోకమునిట అనుసంధానము చేసుకుందుము.

శ్లో॥ సర్వభూతస్థ**మాత్మానం** సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర **సమదర్శనః** ॥ 29 ॥

సమాహితచిత్తుడైన పురుషుడు సర్వభూతాలలో బ్రహ్మాన్ని దర్శిస్తూ, తన ఆత్మను బ్రహ్మాదిస్థావరాంతముగా గల సర్వభూతాలలోను, సర్వభూతాలను తన ఆత్మలోను దర్శిస్తూ ఉంటాడు. ఇదే బ్రహ్మసాక్షాత్కారస్థితి.

ఆ) ఈశావాస్యోపనిషత్తు – ఏమంటుందో చూడండి.

శ్లో॥ యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి ।
సర్వభూతేషు **చాత్మానం** తతో న విజుగుప్సతే ॥

'ఎవడు అన్ని జీవరాశులను ఆత్మలోను, ఆత్మను సకలజీవరాశులలోను దర్శిస్తాడో, అతడు ఎవరిని ద్వేషించడు.

ఇదే "సమదర్శనత్వము"

భజ గోవిందమ్ - గోవిందుని సేవింపుము.



## 25

**అవతారిక :** 'సమచిత్తం వహించు' అంటారు ఈ శ్లోకమున

**శ్లో॥ శత్రౌ మిత్రే పుత్రే బన్ధౌ**
**మా కురు యత్నం విగ్రహసన్ధౌ ।**
**భవ సమచిత్తః సర్వత్ర త్వం**
**వాఞ్ఛస్యచిరాద్యది విష్ణుత్వమ్ ॥ 25**

**పదవిభాగము :** శత్రౌ, మిత్రే, పుత్రే, బన్ధౌ, మా, కురు, యత్నమ్, విగ్రహ-సన్ధౌ, భవ, సమచిత్తః, సర్వత్ర, త్వమ్, వాఞ్ఛసి, అచిరాత్, యది, విష్ణుత్వమ్ ।

**అన్వయక్రమము :** శత్రౌ మిత్రే పుత్రే బన్ధౌ విగ్రహసన్ధౌ యత్నం మా కురు । యది అచిరాత్ విష్ణుత్వం వాఞ్ఛసి సర్వత్ర త్వం సమచిత్తః భవ ।

**ప్రతిపదార్థము :** (హే వాతుల! = ఓ మూఢుడా!)

శత్రౌ మిత్రే పుత్రే బన్ధౌ = శత్రువులయందు, మిత్రులయందు, పుత్రులయందు, బంధువులయందు;

విగ్రహసన్ధౌ యత్నం మా కురు = గిల్లికజ్జాలు పెట్టుకోవద్దు. (సామరస్యముతో నడుచుకోవాలి)

యది = ఒకవేళ

అచిరాత్ = వెంటనే

విష్ణుత్వమ్ = విష్ణుత్వము (విశ్వవ్యాపకత్వము)

వాంఛసి = కోరుకున్నట్లు ఐతే,

త్వమ్ = నీవు,

సర్వత్ర = అన్నిటా

సమచిత్తః = సమచిత్తుడవు

భవ = కమ్ము

**తాత్పర్యము :** శత్రువులయందు, మిత్రులయందు, పుత్త్రులయందు, బంధువులయందు, – గిల్లికజ్జాలు పెట్టుకోవద్దు. (సామరస్యముతో నడుచుకోవాలి) ఒకవేళ వెంటనే విష్ణుత్వము – విశ్వవ్యాపకత్వము, కోరుకున్నట్లు ఐతే అన్నిటా సమచిత్తుడవు కమ్ము.

**పాఠాంతరాలు :** 24, 25 శ్లోకములలో 3, 4 పాదాలు అటుఇటుగా కొన్ని ప్రతులలో కనబడుతున్నాయి. గమనించగలరు.

**సమాసాలు :** 1. విగ్రహసన్ధౌ – విగ్రహశ్చ సన్ధిశ్చ, విగ్రహసన్ధౌ । ద్వంద్వసమాసః ।

2. సమచిత్తం – సమమేవ చిత్తః । సమచిత్తః.

**క్రియలు :** 1. **కురు** – 2వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

2. **భవ** – భూ ధాతోః (భూ–సత్తాయామ్) లోట్ పరస్మైపదే మధ్యమపురుషః ఏకవచనమ్। భ్వాదిః పరస్మైపదమ్, అకర్మకః ।

| | | |
|---|---|---|
| భవతు / భవతాత్ | భవతామ్ | భవన్తు |
| **భవ** / భవతాత్ | భవతమ్ | భవత |
| భవాని | భవావ | భవామ |

మాతృదేవో **భవ** । పితృదేవో **భవ** । ఆచార్యదేవో **భవ** । అతిథిదేవో **భవ** ।

3. వాఞ్ఛసి – వాఛి ధాతోః (వాఞ్ఛ – ఇచ్ఛాయామ్) లట్ పరస్మైపదే మధ్యమపురుషః ఏకవచనమ్ । భ్వాదిః, పరస్మైపదమ్, సకర్మకః ।

| | | |
|---|---|---|
| వాఞ్ఛతి | వాఞ్ఛతః | వాఞ్ఛన్తి |
| **వాఞ్ఛసి** | వాఞ్ఛథః | వాఞ్ఛథ |
| వాఞ్ఛామి | వాఞ్ఛావః | వాఞ్ఛామః |

శ్లో॥ అన్నమయాదన్నమయం హ్యథవా చైతన్యమేవ చైతన్యాత్ ।
ద్విజవర! దూరీకర్తుం **వాఞ్ఛసి** కిం బ్రూహి గచ్ఛ గచ్ఛేతి ॥

– మనీషాపంచకమ్

(... బ్రాహ్మణోత్తమా! దేనిని తొలగుమనుచున్నారు...)

**పదాదర్శము :** ఈశావాస్యోపనిషత్తు – 7 ఇట అనుసంధానము చేసికొనదగును.

మం. యస్మిన్సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః ।
తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః ॥ 7 ॥

ఆత్మే సకలజీవరాశులుగా అభివ్యక్తమైనదని గ్రహించి ఏకత్వభావన ఏర్పరచుకున్న సమదర్శునునకు మోహము ఎక్కడుంటుంది? శోకము ఎక్కడుంటుంది?

భజ గోవిందమ్ – గోవిందుని సేవింపుము.



## 26

**అవతారిక :** 'చర్పటమంజరికా' స్తోత్రమున ఈ చివరి శ్లోకము 'అరిషడ్వర్గాని'కి లోను గావలదని చెప్పుచున్నది.

**శ్లో॥ కామం క్రోధం లోభం మోహం**
**త్యక్త్వాఽఽత్మానం పశ్యతి సోఽహమ్ ।**
**ఆత్మజ్ఞానవిహీనా మూఢా-**
**స్తే పచ్యన్తే నరకనిగూఢాః ॥ 26**

**పదవిభాగము :** కామమ్, క్రోధమ్, లోభమ్, మోహమ్, త్యక్త్వా, ఆత్మానమ్, పశ్యతి, సోఽహం, ఆత్మజ్ఞాన–విహీనాః, మూఢాః, తే, పచ్యన్తే, నరక–నిగూఢాః ।

**అన్వయక్రమము :** (ఆత్మజ్ఞః) కామం క్రోధం లోభం మోహం త్యక్త్వా సోఽహమ్ (ఇతి) ఆత్మానం పశ్యతి । ఆత్మజ్ఞానవిహీనాః మూఢాః తే నరకనిగూఢాః (యమాదిభిః) పచ్యన్తే.

**ప్రతిపదార్థము :** (ఆత్మజ్ఞః = ఆత్మజ్ఞుడు)
కామమ్–క్రోధమ్–లోభమ్–మోహమ్... = అరిషడ్వర్గమును,
త్యక్త్వా = వదలి,
సోఽహమ్ = అది నేనే,
(ఇతి = అని), ఆత్మానమ్ = సత్యపదార్థముగా

పశ్యతి = చూచును.
ఆత్మజ్ఞానవిహీనాః = ఆత్మజ్ఞానములేనివారు,
మూఢాః = మూఢులు అగు,
తే = వారు
నరకనిగూఢాః = నరకమునందుండువారై
పచ్యన్తే = మరగబెట్టబడతారు. ...భజ గోవిందమ్.

**తాత్పర్యము :** ఆత్మజ్ఞుడు అరిషడ్వర్గమును వదలి 'అది నేనే' అని సత్యపదార్థముగా చూచును. ఆత్మజ్ఞానములేని మూఢులు నరకకూపమందుండువారై యమబాధలు పడతారు. 'ఒకరికి విశ్వవ్యాపకత్వము; మఱొకరికి సంసారలంపటము' అని నిశ్చితార్థము.

**పాఠాంతరాలు :** 1. పశ్యతి సోఽహమ్ – భావయకోఽహమ్.

**సమాసాలు :** 1. ఆత్మజ్ఞానవిహీనాః – ఆత్మనః జ్ఞానం ఆత్మజ్ఞానమ్। ఆత్మజ్ఞానేన విహీనాః ఆత్మజ్ఞానవిహీనాః।

2. నరకనిగూఢా – నరకే నిగూఢాః నరకనిగూఢాః।

**క్రియలు :** 1. భావయ – 23వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

2. పశ్యతి – 14వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

3. **పచ్యన్తే** – పచ్ ధాతోః (డుపచష్ పాకే) **కర్మణి**, లట్, ఆత్మనేపదే ప్రథమపురుషః, ఏకవచనమ్। భ్వాదిః, ఉభయపదమ్, సకర్మకః।

| | | |
|---|---|---|
| పచ్యతే | పచ్యేతే | **పచ్యన్తే** |
| పచ్యసే | పచ్యేథే | పచ్యధ్వే |
| పచ్యే | పచ్యావహే | పచ్యామహే |

సూ : షష్టికాః షష్టిరాత్రేణ పచ్యన్తే 5–1–90 – పాణినీయసూత్రాలు. ఇచట కాశికావృత్తి చూడగలరు.

**పదాదర్శము :** 1. కామం–క్రోధం–లోభం–మోహం...

అ) కామక్రోధలోభమోహా, మద, మాత్సర్యాలను – అరిషడ్వర్గాలు అని అంటారు. ఇవి మానవుణ్ణి ఎంతటి స్థాయికైనా దిగజారుస్తాయి. ఇవి మానవుని పతనానికి,

ప్రకృతి వినాశనానికి కారణమవుతాయి. వీటిని ఎవరైతే కలిగి ఉంటారో వారి మనసు ఎప్పుడూ స్వార్థం – సంకుచితభావాలతో నిండి ఉంటుంది. అరిషడ్వర్గాన్ని జయిస్తే భగవత్తత్త్వము బోధపడుతుంది.

శ్లో॥ కామః క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠన్తి తస్కరాః ।
జ్ఞానరత్నాపహారాయ తస్మాత్ జాగ్రత జాగ్రత ॥ 3 ॥

ఆ) శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
కామః క్రోధస్తథా లోభః తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥
– శ్రీమద్భగవద్గీత 16-21

కామక్రోధలోభములు మూడున్నూ జీవుణ్ణి అధోగతిపాలు జేస్తున్నాయి. ఆత్మజ్ఞుడు వీటిని వదలి పురుషార్థానికి యోగ్యుడవుతాడు.

ఇ) శ్లో॥ క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాత్ బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥
– శ్రీమద్భగవద్గీత 2-63

బుద్ధినాశమువలన జీవుడు పూర్తిగా పతనమవుతాడు.

భజ గోవిందమ్ – గోవిందుని సేవింపుము.



**ఉపసంహారశ్లోకములు**

## 27

**అవతారిక :** 'సదాచారము ఆచరణ' చెప్పబడుతున్నదీ శ్లోకమునందు.

**శ్లో॥ గేయం గీతానామసహస్రం**
**ధ్యేయం శ్రీపతిరూపమజస్రమ్ ।**
**నేయం సజ్జనసఙ్గే చిత్తం**
**దేయం దీనజనాయ చ విత్తమ్ ॥ 27**

**పదవిభాగము :** గేయమ్, గీతా–నామసహస్రమ్, ధ్యేయమ్, శ్రీపతిరూపమ్, అజస్రమ్, నేయమ్, సజ్జనసఙ్గే, చిత్తమ్, దేయమ్, దీన–జనాయ, చ, విత్తమ్ ।

**అన్వయక్రమము :** (త్వయా) గీతా–నామసహస్రమ్ గేయమ్ । శ్రీపతిరూపమ్ అజస్రం ధ్యేయమ్ । సజ్జనసఙ్గే చిత్తం నేయమ్ । దీనజనాయ చ విత్తం దేయమ్ ।

**ప్రతిపదార్థము :** గీతా–నామసహస్రమ్ = భగవద్గీతా, విష్ణుసహస్రనామము

గేయమ్ = గానము చేయదగినది.

శ్రీపతిరూపమ్ = శ్రీమన్నారాయణుని రూపము,

అజస్రమ్ = మిక్కిలి,

ధ్యేయమ్ = ధ్యానము చేయదగినది.

సజ్జన–సఙ్గే = సత్పురుషుల సాంగత్యమునందు,

చిత్తమ్ = మనసు,

నేయమ్ = ఉంచదగినది,

దీనజనాయ చ = ఆర్తులకున్ను

విత్తమ్ = ద్రవ్యము,

దేయమ్ = ఇవ్వదగినది. ...భజ గోవిందమ్.

**తాత్పర్యము :** భగవద్గీతా - విష్ణుసహస్రనామము గానము చేయదగినది. శ్రీమన్నారాయణుని రూపము మిక్కిలి ధ్యానము చేయదగినది. సత్పురుషుల సాంగత్యము నందు మనసు ఉంచదగినది. ఆర్తులకున్ను ద్రవ్యము ఇవ్వదగినది.

వీటిని 'ఆచరించండి' అంటుందీ శ్లోకము.

**సమాసాలు :** 1. గీతానామసహస్రమ్ – నామ్నాం సహస్రం నామసహస్రమ్ । గీతా నామసహస్రమ్ చానయోః సమాహారః గీతానామసహస్రమ్ ।

2. శ్రీపతిరూపమ్ – శ్రియః పతిః శ్రీపతిః । శ్రీపతేః రూపం శ్రీపతిరూపమ్ ।

3. సజ్జనసంగే – సజ్జనానాం సఙ్గః సజ్జనసఙ్గః, తస్మిన్ సజ్జనసంగే ।

4. దీనజనాయ – దీనః చాసౌ జనః చ దీనజనః, తస్మై దీనజనాయ ।

5. గేయమ్ – గాతుం యోగ్యం గేయమ్ ।

6. ధ్యేయమ్ – ధ్యాతుం యోగ్యం ధ్యేయమ్ ।

7. నేయమ్ – నేతుం యోగ్యం నేయమ్ ।

8. దేయమ్ – దాతుం యోగ్యం దేయమ్ ।

**పదాదర్శము :** 1. భగవద్గీతను 2) విష్ణుసహస్రనామస్తోత్రమును – ఈ రెండింటిని ప్రతి మానవుడు / తమ దైనందిన చర్యలలో భాగంగా – 'అధ్యయనం – అధ్యాపనం – ఆచరణ'లో పెట్టుకొని సమదర్శనులుగా రూపొందుదురని తలంతును.

భజ గోవిందమ్ – గోవిందుని సేవింపుము.

'తైత్తిరీయమ్' స్వాధ్యాయమును దానమును గూర్చి ఇలా చెబుతుంది.

ఋతం చ స్వాధ్యాయప్రవచనే చ । సత్యం చ స్వాధ్యాయప్రవచనే చ ।
తపశ్చ స్వాధ్యాయప్రవచనే చ । దమశ్చ స్వాధ్యాయప్రవచనే చ ।
శమశ్చ స్వాధ్యాయప్రవచనే చ । అగ్నయశ్చ స్వాధ్యాయప్రవచనే చ ।
అగ్నిహోత్రఇఞ్చ స్వాధ్యాయప్రవచనే చ । అతిథయశ్చ స్వాధ్యాయప్రవచనే చ ।
మానుషఞ్చ స్వాధ్యాయప్రవచనే చ । ప్రజా చ స్వాధ్యాయప్రవచనే చ ।
ప్రజనశ్చ స్వాధ్యాయప్రవచనే చ । ప్రజాతిశ్చ స్వాధ్యాయప్రవచనే చ ।

సత్యమితి సత్యవచా రాథీతరః ।
తప ఇతి తపోనిత్యః పౌరుశిష్టిః ।
స్వాధ్యాయప్రవచనే ఏవేతి నాకో మౌద్గల్యః ।
తద్ధి తపస్తద్ధి తపః ॥ 9

నేర్చుకోవడమూ, నేర్పడమూ – ముఖ్యమైన కర్తవ్యాలు. వాటితో ఋతం, సత్యం, తపస్సు, ఇంద్రియనిగ్రహం, ప్రశాంతత్వం అనేవాటిని పాటించాలి. యజ్ఞాలు, అగ్నిహోత్రమూ నిర్వర్తించాలి. అతిథులను సమాదరించాలి, మానవాళికి మేలు కలిగే పనులు చేయాలి. మంచి సంతానాన్ని పొందాలి. మంచి సంతానము – మనుమలు, మనుమరాండ్రు అంటూ మంచి సంతతిని రూపొందించాలి....

ఈ మంత్రములో స్వాధ్యాయప్రవచనాలు విడువవద్దని పదేపదే ప్రస్తావించడం జరిగింది. మరింత విపులంగా తెలుసుకోగోరితే 'భాష్యం' చూడగలరు.

2) శ్రద్ధయా దేయమ్ । అశ్రద్ధయాऽదేయమ్ । శ్రియా దేయమ్ । హ్రియా దేయమ్ । భియా దేయమ్ । సంవిదా దేయమ్ । - 11.6

శ్రద్ధతో దానం ఇవ్వాలి, ఉదాసీనవైఖరితో దానము ఇవ్వరాదు. శక్తిమేర దానము ఇవ్వాలి, వినమ్రతతో దానం ఇవ్వాలి, గౌరవపూర్వకముగా దానము ఇవ్వాలి, సౌహార్దంతోనూ దానము ఇవ్వాలి.

భజ గోవిందమ్ - గోవిందుని స్మరింపుము.

పారాయణము నిష్కామముగా నిత్యం చేయడంవల్ల అంతఃకరణశుద్ధి జరుగుతుంది. తద్వారా ఆత్మజ్ఞుడు అవుతాడు.



**28**

**అవతారిక :** 'లౌకికమునుండి అలౌకికము'నకు మళ్లాలంటుందీ శ్లోకము.

**శ్లో॥ సుఖతః క్రియతే రామాభోగః**
**పశ్చాద్ధన్త! శరీరే రోగః ।**
**యద్యపి లోకే మరణం శరణం**
**తదపి న ముఞ్చతి పాపాచరణమ్ ॥ 28**

**పదవిభాగము :** సుఖతః, క్రియతే, రామాభోగః, పశ్చాత్, హన్త!, శరీరే, రోగః, యది, అపి, లోకే, మరణమ్, శరణమ్, తత్, అపి, న, ముంచతి, పాపాచరణమ్ ।

**అన్వయక్రమము :** హన్త! సుఖతః రామాభోగః క్రియతే । పశ్చాత్ శరీరే రోగః (భవతి) యద్యపి లోకే మరణం శరణమ్ । తదపి (మూఢః) పాపాచరణం న ముంచతి ।

**ప్రతిపదార్థము :** హన్త! = అయ్యయ్యో!,
సుఖతః = సుఖము కొఱకై,
రామాభోగః = స్త్రీసంబంధరతి,
క్రియతే = చేయబడుతుంది.
పశ్చాత్ = ఆ పిమ్మట

శరీరే = శరీరమందు,

రోగః = రోగము.

(భవతి)

యద్యపి = ఏదిఏమైనా

లోకే = లోకములో

మరణమ్ = 'చావు' అనేది

శరణమ్ = తప్పనట్టిది.

తదపి = ఐనప్పటికి,

(మూఢః)

పాపాచరణమ్ = పాపకార్యాచరణమును

న ముంచతి = వీడకున్నాడు.

**తాత్పర్యము :** అయ్యయ్యో! సుఖము కొఱకై స్త్రీసంబంధరతి చేయబడుతుంది. ఆ పిమ్మట శరీరమందు రోగము. ఏదిఏమైనా లోకములో 'చావు' అనేది తప్పనట్టిది. ఐనప్పటికి (మూఢుడు) పాపకార్యాచరణమును వీడకున్నాడు.

**సమాసాలు :** 1. రామాభోగః - రామాయాః ఆభోగః రామాభోగః । షష్ఠీతత్పురుషః ।

2. శరీరే - శీర్యతే ఇతి శరీరమ్, తస్మిన్ శరీరే ।

3. పాపాచరణమ్ - పాపస్య ఆచరణం పాపాచరణమ్ ।

**క్రియలు :** 1. క్రియతే - 20వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

2. ముఞ్చతి - 12వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము :** 1. మరణమ్

మరణం ఒక అద్భుతం. అది ఎన్నింటికో ముగింపు తెస్తుంది.

మరణం ఒక గొప్ప ఉపశమనం. ఐతే అది అకాలమరణం కాకూడదు.

భజ గోవిందమ్ - గోవిందుని భజింపుము.

2. భగవద్గీత - సాంఖ్యయోగం-27వ శ్లోకమునిట అనుసంధానము చేసికొందుము.

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ ।
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి ॥ 27

(ఏలయన, పుట్టినవారికి మృత్యువు నిశ్చితం, మృతిచెందినవారికి పునర్జన్మ నిశ్చితం, కనుక తప్పింపశక్యముకాని దీనిని గూర్చి దుఃఖించడం తగదు.)

(ఆత్మజ్ఞానము కొఱకు ముందడుగు వేయుము.)



## 29

**అవతారిక :** 'లౌకికమునుండి అలౌకికము'నకు మళ్లాలంటుదీ శ్లోకమున్నూ.

**శ్లో॥ అర్థమనర్థం భావయ నిత్యం**
**నాస్తి తతస్సుఖలేశస్సత్యమ్ ।**
**పుత్త్రాదపి ధనభాజాం భీతిః**
**సర్వత్రైషా విహితా రీతిః ॥ 29**

**పదవిభాగము :** అర్థమ్, అనర్థమ్, భావయ, నిత్యమ్, నాస్తి, తతః, సుఖలేశః, సత్యమ్, పుత్త్రాత్, అపి, ధనభాజామ్, భీతిః, సర్వత్ర, ఏషా, విహితా, రీతిః ।

**అన్వయక్రమము :** నిత్యమ్ అర్థమ్ అనర్థం భావయ । తతః సుఖలేశః న అస్తి (ఇతి) (ఏవ) సత్యమ్ । ధనభాజాం పుత్త్రాదపి భీతిః (వర్తతే) । సర్వత్ర ఏషా విహితా రీతిః (భవతి) ।

**ప్రతిపదార్థము :** నిత్యమ్ = ఎల్లప్పుడూ,
అర్థమ్ = ధనము,
అనర్థమ్ = దుఃఖకరమైనదని
భావయ = ఎఱుంగుము.
తతః = అందువలన,
సుఖలేశః = కించిత్తు సుఖము,
నాస్తి (ఇతి ఏవ) = లేదనేదే,

సత్యమ్ = సత్యమైన మాట.

ధనభాజామ్ = ధనమున్నవారికి,

పుత్రాదపి = పుత్రుడినుంచీ

భీతిః = భయమే.

(వర్తతే)

సర్వత్ర = అంతటా,

ఏషా విహితా రీతిః (భవతి) = ఇదే విధేయమైన రీతి ఉంటుంది.

**తాత్పర్యము :** ఎల్లప్పుడూ ధనము దుఃఖకరమైనదని ఎఱుంగుము. అందువలన కించిత్తు సుఖము లేదనేదే సత్యమైన మాట. ధనమున్నవారికి పుత్రుడినుంచీ భయమే. అంతటా ఇదే విధేయమైన రీతి ఉంటుంది.

**సమాసాలు :** 1. సుఖలేశః – సుఖస్య లేశః సుఖలేశః ।

2. ధనభాజామ్ – ధనం భజన్తీతి ధనభాజః । తేషాం ధనభాజామ్ ।

**క్రియలు :** 1. **అస్తి** – అస ధాతోః (అస భువి) లట్ పరస్మైపదే ప్రథమపురుషః, ఏకవచనమ్, అదాదిః, పరస్మైపదమ్, అకర్మకః ।

| | | |
|---|---|---|
| **అస్తి** | స్తః | సన్తి |
| అసి | స్థః | స్థ |
| అస్మి | స్వః | స్మః |

శ్లో॥ తమస్తమః కార్యమనర్థజాలం
న దృశ్యతే సత్యుదితే దినేశే ।
తథాద్వయానందరసానుభూతౌ
**నైవాస్తి** బన్ధో న చ దుఃఖగన్ధః ॥ – వివేకచూడామణిః

(అంధకారము దానికి సంబంధించిన కష్టాలూ సూర్యోదయం కావటంతోనే కన్పించవు. అదేవిధంగా ఆత్మానుభవము తరువాత బంధమూ బాధల ఛాయలు కన్పించవు.)

**పదాదర్శము :** 1. **భీతిః**

శ్లో॥ భోగే రోగభయం కులే చ్యుతిభయం విత్తే నృపాలాద్భయం
మాన్యే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయా భయమ్ ।
శాస్త్రే వాదభయం గుణే ఖలభయం కాయే కృతాన్తాద్భయం
సర్వం వస్తుభయాన్వితం భువి నృణాం వైరాగ్యమేవాభయమ్ ॥
– భర్తృహరిసుభాషితము – వైరాగ్యశతకము–31

... అస్థిరములగు భోగములయందు విరక్తియే భయము లేనిది.



## 30

**అవతారిక :** 'సాధనయందు పట్టువదలని విక్రమార్కుడవు కమ్ము' అని అంటున్నదీ శ్లోకము.

**శ్లో॥ ప్రాణాయామం ప్రత్యాహారం**
**నిత్యానిత్యవివేకవిచారమ్ ।**
**జాప్యసమేతసమాధివిధానం**
**కుర్వవధానం మహదవధానమ్ ॥** **30**

**పదవిభాగము :** ప్రాణాయామమ్, ప్రత్యాహారమ్, నిత్యానిత్యవివేకవిచారమ్, జాప్యసమేత–సమాధివిధానమ్, కురు, అవధానమ్, మహత్, అవధానమ్ ।

**అన్వయక్రమము :** ప్రాణాయామం ప్రత్యాహారమ్ కురు । నిత్యానిత్యవివేకవిచారమ్ కురు। జాప్యసమేతసమాధివిధానమ్ అవధానం కురు । మహత్ అవధానం కురు ।

**ప్రతిపదార్థము :** ప్రాణాయామమ్ = రేచక పూరకాది వాయుబంధనమును,
ప్రత్యాహారమ్ = శమదమాది ఇంద్రియనిగ్రహమును,
కురు = చేయుము / పాటించుము.
నిత్యానిత్యవివేకవిచారమ్ = సత్యపదార్థమేది, అసత్ ఐనదేదని తెలుసుకొనే జ్ఞానమును (పొందుము),

జాప్యసమేతసమాధివిధానమ్ = జప సమాధుల సాధనను,

అవధానమ్ = జాగరూకతగ,

కురు = చేయుము.

మహత్ + అవధానమ్ = కడుజాగరూకతగ చేయుము.

... భజ గోవిందమ్.

**తాత్పర్యము :** 'సాధనయందు ఏమాత్రము అలసత్వముండరాదు' అని నిర్దేశించుచున్నదీ శ్లోకము.

**సమాసాలు :** 1. జాప్యసమేతసమాధివిధానమ్ – జపసంబంధౌ ఆచరణం జాప్యమ్ । సమాధేః విధానం సమాధివిధానమ్ । జాప్యతే సమేతం సమాధివిధానం జాప్యసమేత–సమాధివిధానమ్, తత్ (ద్వితీయా) జాప్యసమేతసమాధివిధానమ్ ।

2. నిత్యానిత్యవివేకవిచారమ్ – నిత్యం చ అనిత్యం చ నిత్యానిత్యే, నిత్యానిత్యాభ్యాం వివేకః స చాసౌ విచారశ్చ, నిత్యానిత్యవివేకవిచారః, తమ్ ।

**క్రియలు :** 1. కురు – 2వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

**పదాదర్శము :** ప్రాణాయామమ్

ప్రాణాయామమ్ : 'ఉచ్ఛ్వాసనిఃశ్వాసాలను అదుపులో ఉంచడం' ప్రాణాయామని పతంజలి మహర్షి నిర్వచించారు. ప్రాణమనగా జీవనము, ఆయామమనగా పొడగించుట. గోరక్‌నాథ్ విరచితమైన 'గోరక్షశతకమ్'లోను, వారి శిష్యుడు యోగి స్వాత్మరామ విరచితమైన హఠయోగప్రదీపికలోను, పాతంజలియోగశాస్త్రంలోనూ ప్రాణాయామము చెప్పబడినది. విజ్ఞానభైరవతంత్రములో – 112 ధారణలు (రీతులు) వివరించబడినాయి. వాటిలో ఏది మన మనోవాక్కాయములకు అత్యంత అనుకూలంగా నుండునో దానిని స్వీకరించి ప్రాణాయామమును గురుముఖతః తెలుసుకొని, ఆచరించడం ద్వారా మనస్సును శుద్ధి చేసుకోవచ్చును.

ప్రాణాయామము – ముఖ్యముగా త్రివిధములని చెప్పబడినది. అవి 1. కనిష్ఠ ప్రాణాయామము, 2. మధ్యమ ప్రాణాయామము, 2. ఉత్తమ ప్రాణాయామము.

సాధకులు ప్రారంభములో ప్రాతఃసమయమున మేల్కొని కాలకృత్యములు

తీర్చుకొని స్నానాదులొనర్చి సుఖాసీనులై ఎడమముక్కుతో నెమ్మదిగా గాలిని పీల్చి, రెండు ముక్కులను బంధించి, కుంభించి, ఆ పిమ్మట కుడిముక్కుతో నెమ్మదిగా గాలిని వదలుట; తిరిగి కుడిముక్కుతో నెమ్మదిగా గాలిని పీల్చి, రెండుముక్కులను బంధించి, కుంభించి, ఆ పిమ్మట ఎడమ ముక్కుతో నెమ్మదిగా గాలిని వదలుట; ఇట్లు క్రమముగా పూటకు 12 సార్లు చొప్పున మూడు పూటలా 3×12 = 36 సార్లు చేయుట – కనిష్ఠ ప్రాణాయామము, 72 సార్లు చేయుట – మధ్యమ ప్రాణాయామము, 108 సార్లు చేయుట – ఉత్తమ ప్రాణాయామము. ఇందు

1. పూరకము : ఊపిరితిత్తుల నిండుగా నెమ్మదిగా గాలిని పీల్చడాన్ని పూరకము అంటారు.

2. కుంభకము : పూరకము తరువాత గాలిని ఊపిరితిత్తుల లోపలే ఆపి ఉంచడం అంతఃకుంభకము అవుతుంది. అటులనే రేచకము తరువాత గాలిని ఊపిరితిత్తుల లోపలికి పీల్చకుండా ఆపి ఉంచడం బాహ్యకుంభకము అవుతుంది.

3. రేచకము : ఊపిరితిత్తుల నుండి గాలిని నెమ్మదిగా బయటకు పంపించడాన్ని రేచకము అంటారు.

త్రివిధబంధములతో (జాలంధరబంధము, ఉడ్యాణబంధము, మూలబంధము) కుంభకప్రాణాయామము మాత్రము అనుభవజ్ఞుల సమక్షములో అభ్యసించుట మంచిది.

శ్లో॥ ఊర్ధ్వం మేఢ్రాదధో నాభేరుడ్డీయానం ప్రచక్షతే ।
ఉడ్డీయానజయో బన్ధో మృత్యుమాతంగకేసరీ ॥ 35

శ్లో॥ జాలంధరే కృతే బన్ధే కణ్ఠసంకోచలక్షణే ।
న పీయూషం పతత్యగ్నౌ న చ వాయుః ప్రకుప్యతి ॥ 36

శ్లో॥ పార్ష్ణిభాగేన సమ్పీడ్య యోనిమాకుంచయేద్గుదమ్ ।
అపానమూర్ధ్వమాకృష్య మూలబన్ధో నిగద్యతే ॥ 37

– గోరక్షశతకమ్

ప్రాణాయామము ముఖ్యముగా ఎనిమిదిరకములు. ఇవి అష్టకుంభకాలు. 1. సూర్యభేదనము, 2. ఉజ్జాయి, 3. సీత్కారి, 4. శీతలి, 5. భస్త్రిక, 6. భ్రామరి, 7. మూర్ఛ, 8. ప్లావని – వీటిని సాధకులు అనుభవజ్ఞుల సమక్షములో నేర్వదగును.

**2. పాతంజలి మహర్షి – అష్టాంగయోగము – ప్రత్యాహారము**

1. యమ, 2. నియమ, 3. ఆసన, 4. ప్రాణాయామ, 5. ప్రత్యాహార, 6. ధారణ, 7. ధ్యాన, 8. సమాధి.

అ) శరీరం మాలిన్యం పోవటానికి ఆసనాలు

ఆ) శ్వాసకు సంబంధించిన మాలిన్యం పోవటానికి ప్రాణాయామాలు

ఇ) నడవడికలోని మాలిన్యం పోవటానికి యమనియమ ప్రత్యాహారాలు.

ఈ) మనోమాలిన్యం పోవటానికి ధారణ, ధ్యాన, సమాధులు.

ప్రత్యాహారము : ఇంద్రియాలు తమ తమ లక్షణాలతో సంబంధం కోల్పోవడమే ప్రత్యాహారము. మనకు 5 జ్ఞానేంద్రియాలున్నాయి. అవి జ్ఞానసముపార్జనకు ఉపయోగ పడే మాధ్యమాలు, రూపాలను గ్రహించటానికి – కన్ను; శబ్దాలను గ్రహించటానికి – చెవి; వాసనలు గ్రహించటానికి – ముక్కు; రుచులను గ్రహించటానికి – నాలుక; స్పర్శను గ్రహించటానికి – చర్మము. ఐదు కర్మేంద్రియాలు కూడా ఉన్నాయి.

వాక్కుకు – మాట్లాడటం, పాదానికి – సంచారము, హస్తానికి – గ్రహణం, పాయువుకు – విసర్జించటం, ఉపస్థకు – సంతానాన్ని కలుగజేయటం. చివరిది మనస్సు. ఈ పదకొండు ఇంద్రియాలద్వారా మనిషి జీవనం సాగిస్తుంటాడు. ఇంద్రియ కార్యకలాపాలను ధర్మముతో సరిచేసుకొంటూ నిగ్రహాన్ని కలిగి ఉన్నప్పుడు మనస్సులో ప్రశాంతత ఏర్పడుతుంది. అస్తు.

**3) నిత్యానిత్యవివేకవిచారమ్**

శ్లో॥ బ్రహ్మసత్యం జగన్మిథ్యేత్యేవం రూపో వినిశ్చయః ।
సోఽయం నిత్యానిత్యవస్తువివేకః సముదాహృతః ॥ 22

(ఎల్లవేళలయందు అంతటా స్థిరముగా మార్పుకు లోనుగానిదిగా వ్యాపించి ఉండేది బ్రహ్మమని, అదియే సత్యమని తెలుసుకొనుటయే 'ఆత్మానాత్మవివేకము' అని అందురు. కనబడుతూ నిత్యమూ మార్పులు చెందునది అగు ఈ జగత్తు అసత్యము / మిథ్య అని తెలుసుకొనుట వివేకమగును. మనము సహజముగా నిత్యమూ సత్యము అయిన సుఖమును కోరుకుందుము. అనిత్యమైనదానిని కోరుకోము. కావున ఈ జగత్తు

అసత్యము అని చెప్పనిచో మన మనసు వైరాగ్యము వైపు మరలదు. వైరాగ్యము అలవడిన సాధనచతుష్టయం సులభముగా అనుచరణీయము అవుతుంది. సాధనచతుష్టయము అనగా

శ్లో॥ ఆదౌ నిత్యానిత్యవస్తువివేకః పరిగణ్యతే
ఇహాముత్ర ఫలభోగ విరాగస్తదనంతరమ్
శమాది షట్కసంపత్తిర్ముముక్షుత్వమితి స్ఫుటమ్' 19

– వివేకచూడామణిః



## 31

**అవతారిక :** 'గురుస్మరణ' చేస్తున్నదీ శ్లోకము.

**శ్లో॥ గురుచరణామ్బుజనిర్భరభక్తః**
**సంసారాదచిరాద్భవ ముక్తః ।**
**సేన్ద్రియమానసనియమాదేవం**
**ద్రక్ష్యసి నిజహృదయస్థం దేవమ్ ॥** **31**

**పదవిభాగము :** గురుచరణ+అమ్బుజ–నిర్భర–భక్తః, సంసారాత్, అచిరాత్, భవ, ముక్తః, స+ఇన్ద్రియ–మానస–నియమాత్, ఏవమ్, **ద్రక్ష్యసి**, నిజ–హృదయస్థమ్, దేవమ్ ।

**అన్వయక్రమము :** గురుచరణామ్బుజనిర్భరభక్తః (సన్) సేంద్రియమానసనియమాత్ సంసారాత్ అచిరాత్ ముక్తః భవ । ఏవం (చేత్) నిజహృదయస్థం దేవం ద్రక్ష్యసి ।

**ప్రతిపదార్థము :**

గురుచరణామ్బుజనిర్భరభక్తః (సన్) = గురుపదకమలములందు అపారమైన భక్తి కలిగినవాడవు అగుచు,
సేంద్రియ–మానస–నియమాత్ = ఇంద్రియములూ మానసమూ కూడ నియమించుట ద్వారా
అచిరాత్ సంసారాత్ = శీఘ్రముగా చావుపుట్టుకల నుండి,

ముక్తః = ముక్తుడవు

భవ = కమ్ము.

ఏవమ్ (చేత్) = ఇట్లా ఐతే,

నిజహృదయస్థం దేవమ్ = తన హృదయముననున్న పరమాత్మను,

ద్రక్ష్యసి = దర్శించుకొందువు.

**తాత్పర్యము :** 'గుర్వనుగ్రహమున పరమాత్మానుసంధానము తప్పక జరుగును' అనేది నిశ్చితార్థము.

**సమాసాలు :** 1. గురుచరణాంబుజనిర్భరభక్తః – నిర్భరా (హృదయే) భక్తిః, యస్య సః నిర్భరభక్తః । గురుచరణమేవ అంబుజం గురుచరణాంబుజమ్ । గురుచరణాంబుజే నిర్భరభక్తః, గురుచరణాంబుజనిర్భరభక్తః ।

2. సేన్ద్రియమానసనియమాత్ – ఇంద్రియేణ సహితం మానసం సేన్ద్రియమానసమ్, తస్య నియమః సేన్ద్రియమానసనియమః, తస్మాత్ సేన్ద్రియమానసనియమాత్ ।

3. నిజహృదయస్థమ్ – నిజం హృదయం నిజహృదయమ్, నిజహృదయే తిష్ఠతీతి నిజహృదయస్థః, తమ్ నిజహృదయస్థమ్.

**క్రియలు :** 1. ద్రక్ష్యసి – 'దృశ్' ధాతోః (దృశిర్ ప్రేక్షణే) లృట్ పరస్మైపదే మధ్యమపురుషః, ఏకవచనమ్, భ్వాదిః, పరస్మైపదమ్, సకర్మకః ।

| | | |
|---|---|---|
| ద్రక్ష్యతి | ద్రక్ష్యతః | ద్రక్ష్యన్తి |
| **ద్రక్ష్యసి** | ద్రక్ష్యథః | ద్రక్ష్యథ |
| ద్రక్ష్యామి | ద్రక్ష్యావః | ద్రక్ష్యామః |

శ్లో॥ అరిఘ్నం సింహసంకాశం క్షిప్రం **ద్రక్ష్యసి** రాఘవమ్ ।
లక్ష్మణం చ ధనుష్పాణిం లఙ్కాద్వారముపస్థితమ్ ॥ 25
– శ్రీమద్రామాయణము – సుందరకాండము – 68

(శత్రుసంహారకుడును, సింహసమానుడును అగు శ్రీరామచంద్రమూర్తిని, ధనుర్ధారియైన లక్ష్మణస్వామిని లంకానగరద్వారమునందు నిలచియున్నట్లు అచిరకాలములోనే చూడగలవు.)

2. భవ - 25వ శ్లోకవ్యాఖ్యానభాగము చూడుడు.

భజ గోవిందమ్ - గోవిందుని సేవింపుము.

మృణాళినీవ్యాఖ్యానము - ది. 28-08-2022న ఉదయం 9.45 గంటలకు సంకల్పింపబడి, ది. 29-08-2022న ఉదయం 8.03 గంటలకు ప్రారంభింపబడి, ది.08-09-2022న రాత్రి 6.39 గంటలకు పూర్తిచేయబడినది.

శ్రీః



## - శ్లోకానుక్రమణికా -



